ఫోన్ : 2066 టెలిగ్రామ్ : హిందీసంఘ్
సంపుటి 6 సంచిక 9

# ప్రవంతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకులు
వేమూరి ఆంజనేయశర్మ
సి. నారాయణరెడ్డి

★

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర
6-2-959, ఖైరతాబాదు — హైద్రాబాదు - 4.

సంవత్సర చందా రు. 3-0-0
డిసెంబరు, 1959
విడిప్రతి రు. 0-4-0

**Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.**

## ఈ సంచికలో

సంపాదకీయము :

# కీ. శే. కురుగంటి సీతారామయ్యగారు

భట్టాచార్య బిరుదాంచితులు శ్రీ కురుగంటి సీతారామయ్యగారి నిర్యాణం ఆంధ్రవాఙ్మయలోకానికి తీరనిలోటు. నీరక్షీరవివేకం, నిశిత విమర్శనాపాటవం, నిజాయితీగల ప్రవర్తన, ముప్పేటలుగొన్న మూర్తి వారిది. ఎదుట జిలుగు నవ్వును ప్రదర్శించి చాటుకు పెదవివిరిచే స్వభావం కాదు వారిది. యువకవులు గాని, కవిచక్రవర్తులు గాని వారి నిష్పాక్షిక విమర్శకు తలొగ్గవలసిందే. వారు మిత్రులగోష్ఠిలో ఎంత సరసంగా మాట్లాడేవారో సాహిత్యసభల్లో అంతే సరసంగా సూటిగా మాట్లాడేవారు. గిడుగువారి బాటలో నడచిన ఉద్దండ పండితులైన పంచాగ్నుల మున్నగు వారి పంక్తిని గణనీయులు కురుగంటివారు.

కట్టమంచివారి 'కవిత్వతత్త్వవిచారము' నకు ఖండన గ్రంథముగా 'అలంకారతత్వవిచారము' ప్రకటించిననాడే కురుగంటివారు నిర్భీక విమర్శకులుగా ఆంధ్రసాహితికి పరిచితులైనారు. వారి 'తంజాపురాంధ్ర నాయక రాజచరిత్రము' చిరకాలమధనం తర్వాత చరిత్రాంభోధిలో వెలువడిన అమృతపాత్ర. శైవమతంపై, సాతవాహనులపై వారు ప్రచురించిన వ్యాసాలు ఆరంగాలలో అక్షరంగా నిలిచేవి. వారి కథా రచనాశక్తికి 'కథాత్రయి' మచ్చుతునకలు. ఇంకా వెలుగు చూడని 'షడ్దర్శనములు' 'ఆంధ్ర సంస్కృతి చరిత్ర' వారి బహుముఖపాండితీ శౌండిమకు పతాకసదృశములు. ఆంధ్రేతరులకు తెలుగు సాహిత్యంలోని మీగడతరలకను చవిచూపడానికి ఏనాడోవారు 'A Hand Book of Telugu Literature' అనే గ్రంథాన్ని రచించి ప్రచురించినారు.

వారి 'నవ్యాంధ్రసాహిత్యవీధులు' 1950 దాకా వెలువడిన నవ్య సాహిత్యానికి ఏకైక భాష్యగ్రంథం. ఇంతవరకు ప్రాచీనాంధ్ర సాహిత్యానికే సమగ్రమైన చరిత్రలేదు. ఇక నవ్యసాహిత్యాన్ని అడిగే దెవరు? ఈ స్థితిలో

కురుగంటివారి గ్రంథమే తెలుగులకు దీపస్తంభంలా ఉంది. ఈ గ్రంథంలో సంప్రదాయంపై వారు వ్రాసిన ప్రత్యేకాధ్యాయం అమూల్యమైనది. అక్కడక్కడా వారి అభిరుచులూ, కొందరు కవుల వ్యక్తిగత విషయాలూ ముందుకు త్రోసుకొని వచ్చినా అవి పరిగణింపదగినవికావు. కురుగంటి వారే అన్నట్లుగా ఈగ్రంథంలో 'ఈకాలపు యావదాంధ్రజీవనం చిత్రించ బడింది !'

చరిత్ర, సాహిత్యం, మతం, తత్త్వ శాస్త్రం, మొదలైన విభిన్న వాఙ్మయ ప్రక్రియలలో సాధనచేసి గడిదేరిన విద్వాంసులు కురుగంటివారు. చివరి ఊపిరి దాకా 'సీతారామ' ధ్యానంచేస్తూ శివైక్యంచెందిన చిన్మయ జీవి సీతారామయ్యగారు.

వారి పుణ్యస్మృతికి మా శ్రద్ధాంజలి.

—సంపాదకులు.



# అందాల మందలింపు

—శ్రీ బోయి భీమన్న

(ఒకనాటి వేకువజామున, ప్రణయ కలహంతో బైట గృహోపవనంలో కూర్చుని, నెలవంకను చూస్తున్న భావుకుని అవస్థ.)

నెలవంక నత్తు పై ప్రతి
ఫలియించిన మెరుపు ఏ వివాద వివశా
కలితమొ ? అనిద్రతా ప్ర
జ్వలితమొ ? తమి కల్వకంటి సామోమయ్యెన్ !

ఆ నగపై రుచుల్ రజము
లంచిత మాధురు లన్న యూహతో,
వానకు ధూళివోలె, మధు
పాలు - తమస్సులు - పైకి రేగె; ఉ
ద్యానము తెల్లబోయెను; త
దంకము పై నొక సేన యుండితిన్
ధేనువు మేసి పోయిన ప్ర
దీపపు పాదున కాయ పోలికన్.
పడియుంటి నేను పెను గు
మ్మడికాయగ, చంద్ర గోళ మనుకొని నాపై
పడి దోమల రాకెట్టులు
కడు సున్నితమైన తనువు గంటులు పెట్టున్.

దోమ యదెంత ? నా పయికి
తోలిన మర్త్యుని తాహ తెంత ? వెం
జామర చాలు నొక్క నిమి
షాన తుపానులనే సృజింప, ఏ

తామస మేని అంతవర
దాకనె; నెత్తురు నెంత త్రాగినన్
దోమ గజమ్ము కా గలుగు
నో ? పర వేధ హితమ్ము గూర్చునో ?

భావలత లూర్ధ్వమూలమ్ములై విశాల
విశ్వ జీవ సారములు నింపికొని వచ్చి,
హృదయమును పెంచికొని వికసింప వలయు
సర్వ మానవ ప్రేమ పుష్పములు నిండ.

వికసించని హృదయముతో,
ఒక బారెడు కూడ పోని ఊహలతో, చం
ద్ర కళావతంసి నెటు లం
దు కొనం గల నేను వట్టి దూకుడు నోటన్ ?

తలుపులు తీసి గుండియకు,
తాళము నోటికి వేసి, భావ సం
కలిత సుధా ప్రవాహముల
గట్టక సేద్యము లేదు; పండ దా
త్మ లవము, సన్మనస్విని త
మస్విని యాశలు తెల్లవారు లో
పలిదె సుఖమ్ము; మీద కను
పట్టవు చెక్కుల నీటి చుక్కలున్.
ప్రణయ రజనికి విరహ వేదన రగిల్చి,
కలువ కనులకు నెత్తురు కాటుక నిడి,
'మనిషివా ?' యంచు అందాలు మందలింప
పారిపోకుండ నెట్లుందు ఆరుబైట ?



# కీ. శే. కురుగంటి సీతారామభట్టాచార్యులు

—డాక్టరు బి. రామరాజు, MA., Phd.,



జననము : 15-12-1890

మరణము : 4-11-1959

'నిండు మనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము "జగన్నుత" విప్రులయందు.' అట్టి "జగన్నుత" విప్రులయం దొకరు మొన్న మొన్న కీర్తిశేషులైన కురుగంటి సీతారామభట్టాచార్యులుగారు. వారి జన్మ స్థలము తెనాలితాలూకా వేమూరు గ్రామము. ఏడు తరములనుంచి పరంపరగా సరస్వతీ కటాక్షమునకు పాత్రమైనకుటుంబము వారిది. ప్రపితామహుడు కురుగంటి వెంకటరామశాస్త్రి అనుగమభట్టాచార్యుడని, తర్కసింహమని, అపర గౌతముడని పేరుపొందిన పండితప్రకాండుడు. వెంకటరామశాస్త్రిగారి కుమారులు రామస్వామిశాస్త్రిగారు. వీరి కుమారులు కృష్ణశాస్త్రిగారు. ఈయనభార్య రామలక్ష్మమ్మ. ఈ దంపతులకు వెంకటరమణశాస్త్రి (పిచ్చయ్యశాస్త్రి యనునది వ్యవహారనామము.), మార్కండేయశాస్త్రి మరియు మొన్న పరమపదించిన సీతారామయ్యగార లుద్భవించిరి. సీతారామయ్యగారి పెద్దన్నగారయిన వెంకటరమణశాస్త్రిగారు "తర్కదీపికా" రచయితలు. లలితా శతకము, దక్షిణామూర్తి స్తోత్రము మున్నగునవి వారి ఇతర కృతులు. వేమూరు సంస్కృతకళాశాలా స్థాపకులు. శ్రీ కల్యాణానందభారతీ స్వాములవారికి ప్రతిస్పర్థులు; సన్యసించి మరణించినారు. కురుగంటివారి ఇంకొక కోవలో మాధవశాస్త్రిల కుమారులైన కురుగంటి సుబ్రహ్మణ్యముగారు. క్రీ. శ. 1841 లో జన్మించిరి. వీరికి సుబ్రహ్మణ్యచయను లనునది పూర్వాశ్రమనామము. ఈ చయనులుగారు నిజాంప్రభుత్వమున అబ్కారీశాఖలో శిరస్తదారుగా ఉద్యోగము చేసిరి. వీరు సికింద్రాబాదులో నుండినకాలముననే అగ్న్యాధానము, జ్యోతిష్టోమము, గరుడచయనము మొదలగు వైదికక్రతువు లొనర్చిరి. ఈయన మహాపండితుడు;

వేదాంతవేత్త. వీరి భార్య లక్ష్మమ్మగారు. క్రీ శ. 1917 లో ఈయన ఆశ్రమ స్వీకార మొనర్చిరి. "అద్వైతానందతీర్థు" లను పేరున నుండిరి. వీరి రచనము లనేకములు 'అద్వైతానందలహరి' యను పురుషసూక్తభాష్యము, భగవద్గీతా తాత్పర్యదీపిక, ఛాందోగ్యోపనిషద్భాష్యము, పంచోపనిషత్తాత్పర్యదీపిక, బ్రహ్మ సూత్రభాష్యము మొదలైనవి వీరి రచనములు. వీరు క్రీ శ. 1926 ఫిబ్రవరి శివ రాత్రి పుణ్యదినమున 85 వ ఏట తమ దేహమును చాలించిరి.

ఈ మహానుభావుని దత్తపుత్రుడే మొన్న ఆంధ్రవాఙ్మయాకాశమునుండి జారిపోయిన వెలుగుచుక్క కురుగంటి సీతారామభట్టాచార్యులుగారు. చిన్నప్పటి నుండియే తండ్రికడనే వేదాధ్యయనమును, శాస్త్రాభ్యాసమును చేసిన ధన్యులు సీతారామయ్యగారు. ఇంగ్లీషు చదువవలెనను కోర్కె వారి కాలస్యముగా కలిగినది. అది కొల్లూరు స్కూలులో ప్రారంభమై మద్రాసులో ముగిసినది. మద్రాసులో వారు క్రీ శ. 1912 నుండి 1917 వరకు విద్యార్థిగా నుండిరి. ప్రెసిడెన్సీ కళాశాలలో 1917 లో సంస్కృతము ఐచ్ఛికముగా మొదటి తరగతిలో మొదటివారుగా ఆనర్సు పట్టమందినారు. ప్రెసిడెన్సీలో మొదటివారుగా నెగ్గినందులకు వారికి స్వర్ణ పతకము లభించినది. పాశ్చాత్య దేశములకేగి ఉన్నతవిద్య నభ్యసించుటకు స్కాలర్‌షిప్‌కూడ లభించినది. కాని పూర్వాచారపరాయణ యగు తల్లిమాట కెదురాడని సీతారామయ్యగారి కీ రెండవలాభము పరిత్యాజ్యమైనది. మహామహో పాధ్యాయ కుప్పుస్వామి శాస్త్రులవారికడ సంస్కృత మభ్యసించు భాగ్యమబ్బిన కురుగంటివారి భాగ్యమే భాగ్యము.

మొదటనే కురుగంటివారికి స్కూళ్ళ ఇనస్పెక్టరు (గెజటెడ్) ఉద్యోగము లభించినది. కాని దానిని వారు నిర్వహించినది (1918—1920) రెండేండ్లే. యావ ద్భారతమున సత్యాగ్రహోద్యమము పెల్లుబికిన దినములవి. ఆనాటి దేశభక్తి త్యాగ మునకు మారురూపము. అందుకే కురుగంటివారు కొంగు బంగారమైన చక్కని యుద్యోగమునకు (1921) స్వస్తిచెప్పిరి. అధికారులు తొందరపడవలదనియు, ఇంకొకమారాలోచించుకొనవలసినదనియు ఆదేశించిరి. కాని సీతారామయ్యగారి కది చేతకాని పని యయ్యెను. ఆనాడు సిరిరా మోకాలొడ్డిన కురుగంటివారికి పెద్ద యుద్యోగ మెన్నటికిని లభించకుండునట్లు లక్ష్మీదేవి శాప మొసగి తరలిపోయినది. అత్తగారి "అఘాయిత్యము" నకు అయ్యోపాపమనుకొన్న సరస్వతి మాత్రము కురుగంటివారిని దండిగా కటాక్షించినది. కోడలి కటాక్షవీక్షణములు చూచిన

కొలది అత్తగారి సాధింపు లధికమైనవి. "పులుసు వచ్చి బువ్వకొట్టుకొనిపోయిన" దన్న సామెత సార్థకమైనది. విగ్రహమేకాని యనుగ్రహము లేదయ్యెను.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారు జాతీయ విద్యావిధానము నిర్ణయించుట కేర్పరచిన సంఘమందు సీతారామయ్యగారిని సభ్యులుగా నియమించిరి. కొన్నాళ్ళు కురుగంటివారు బెజవాడ జాతీయ కళాశాలా ప్రధానాచార్యులుగాను, మరికొన్నాళ్ళు కొవ్వూరు సంస్కృతకళాశాల ప్రిన్సిపాల్‌గాను పనిచేసిరి. వారు బెజవాడలో నుండినప్పుడే 'విద్యార్థి' పత్రికను స్థాపించి సంపాదకులుగా నుండిరి. సీతారామయ్యగారు మొదటితరగతి ప్లీడరీ పరీక్షయం దుత్తీర్ణులై కొంతకాలము తెనాలిలో ప్రాక్టీసుపెట్టి కటకట పడిరి తరువాత తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో సూపరింటెండెంటుగా చేరిరి. అచ్చటి తెలుగు తాళపత్రగ్రంథముల పట్టిక సిద్ధముచేయుటకు ఆంధ్రవిశ్వకళాపరిషదధ్యక్షులు శ్రీ రాధాకృష్ణపండితులు వీరి నచ్చట (17-1-1931) నియోగించిరి. కాని సీతారామయ్యగా రా 'సరస్వతీ మహల్' లో నున్నదికూడ కొలదికాలమే. అది లక్ష్మీమహల్ కాదుగదా! తండ్రిగారిని వలెనే సీతారామయ్యగారినికూడా తెలంగాణ మాకర్షించినది. నాటి నుండి నేటివరకును కోయనిన కోటిమంది తనుగన్న బిడ్డలున్నను, తెలంగాణతల్లి ఎందరెందరినో తన యొడిలో నిడుకొని సాకుచున్నది. అవి టర్నరుగారు నిజాంకళాశాల ప్రిన్సిపాలుగా ఉన్నదినములు. శ్రీ కురుగంటి సీతారామయ్యగారికి సంస్కృతాంధ్రోపన్యాసక పదవి (1932) నిజాంకళాశాలలో లభించినది. మనసు కొంత కుదుటపడి, ఈనా దనేకరంగములం దున్నత పదవు లలంకరించుచున్న పెక్కురు శిష్యులను దిద్దితీర్చి, వ్రాయదలచినవి వ్రాసి, చేయదలచినవిచేసి పదిహేను సంవత్సరములు సీతారామయ్యగారికి ప్రశాంతముగా గడచినకాలమిది. సీతారామయ్యగారి భార్య శేషమ్మగారు 1842 లో మరణించిరి. రిటైరైన తరువాత, పోలీసుచర్యకు పూర్వము, సీతారామయ్యగారు హైద్రాబాదు ప్రభుత్వ సమాచార శాఖలోను, దక్కన్ రేడియోలోను, అనువాదకులుగా కొంత కాలము పనిచేసిరి. అటుతరువాత ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయమున 1950 నుండి 1954 వరకును, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత అకాడమీలో 1954 నుండి 4-11-1959 సాయంకాలము మూడుగంటల వరకును ఉద్యోగము చేసిరి. ఇది కురుగంటి సీతారామయ్యగారి పూర్వుల యొక్కయు, వారి యొక్కయు క్లుప్తమైన చరిత్రము.

శ్రీ కురుగంటి సీతారామయ్యగారి కాంధ్రవాఙ్మయమున మహోన్నత స్థానమున్నది. విమర్శకుడుగా, పరిశోధకుడుగా, పండితుడుగా కురుగంటివారొనర్చిన సేవ యమూల్యము. తెలుగువారి సాహిత్య సంస్కృతులగూర్చి ఆంగ్లమున వ్రాసిన వారి రచనములు తెలుగువారి సార్థక్యమును యావద్భారతమునకును చాటినవి. విమర్శకులుగా పరిశోధకులుగా రాణించిన పెద్దలందు స్వరయుక్తముగా వేదమును పఠింపగల సామర్థ్యము కురుగంటివారికే దక్కినది. కురుగంటివారు పిన్నటనే సాహిత్యయాత్ర కారంభించినారు; విద్యార్థిగా నుండినప్పుడే ఆశుకవిత అల్లగలిగినారు. పరీక్షాపత్రములకు సమాధానములుకూడ పద్యములందు వ్రాయునట్టి ఆశుకవిత వారి కలవడినది. వారు వ్రాసిన పద్య సమాధాన పత్రములు నాడు పరీక్షకులుగా నుండిన గురుజాడ అప్పారావుగారు చూచి వారి ప్రతిభకు మెచ్చి పరీక్షలందుమాత్ర మటుల వ్రాయవలదని హెచ్చరించిరట. అలంకారము లనవసరమన్న కట్టమంచివారి వాదము నెదుర్కొని కురుగంటివారు 1914 లో 'అలంకార తత్త్వ విచారము'ను రచించిరి. ఆ సంవత్సరమే 'లవంగి' యను నవలను 'వింజమూరి మండలి' (వారి మద్రాసు స్నేహబృందము) వారికి వినిపించిరి. అది ప్రకటింత మనుకొన్నంతలో అదే పేరుతో మరియొక నవల వెలువడగా కురుగంటివారు తమ ప్రకటనోద్యోగమును విరమించుకొనిరట సీతారామయ్యగారు తంజావూరు తాళపత్ర గ్రంథాలయమున నున్నప్పుడు చేసినకృషి అమూల్యమైనది. సరస్వతీ మహల్‌లోని తెలుగు తాళపత్ర గ్రంథముల పట్టిక మొదటి సంపుటమును వారే సిద్ధమొనర్చిరి. అది ముద్రణమగునాటికి వారా యుద్యోగమును వదలి హైద్రాబాదు వచ్చిరి. హైద్రాబాదులోనుండి ఆ పట్టికకు చక్కని పీఠికను గూడ వారే సంతరించిరి. కాని ఆ గ్రంథపట్టిక మరియు పీఠిక వారి పేరుతో ప్రకటింపబడలేదు. తెలుగేమాత్రమును రాని P. P. S. శాస్త్రిగారి పేరుతో వెలువడిన దా గ్రంథరాజము. చివరి కా గ్రంథమున కురుగంటివారి సేవాప్రశంసయైనను లేదు. సీతారామయ్యగారందుల కెంతబాధ పడిరో వారి నవ్యాంధ్ర సాహిత్య వీథులు చూచినవారి కవగతమగును. వారు తంజాపురమందుండగనే "తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్రము"ను 1932 లో శ్రీ రాధాకృష్ణ పండితుల కంకితముగా ప్రచురించినారు. నాటికిని నేటికిని ఆ విషయమున వారి గ్రంథమున కదియే సాటి. సీతారామయ్యగారి తంజాపుర ప్రవాసము ఆంధ్రులపాలిటికి వరమైనది. నాయకరాజుల చరిత్రముతోబాటు ఆ రాజుల ప్రాపున వాఙ్మయసేవ యొనర్చిన "కొందరు తంజావూరు కవులు-పండితులు" గ్రంథము రచించుటకుకూడ వారి

కవకాశము కలిగినది. శ్రీ సీతారామయ్యగారు పండిత పరిశోధకులేకాదు. కథా రచయితలనికూడ చేయెత్తి చాటునది వారి "కథాత్రయి".

హైద్రాబాదులో ఆచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు, శ్రీ ఖాసింఖాఁ గారు, శ్రీ సీతారామయ్యగారు కలిసి ఆంధ్ర సాహిత్య పరిషత్తును స్థాపించిరి. (ఈ సంస్థను వీరి ప్రతిపక్షులు 'రాకాసి' పరిషత్తని పిలిచెదరు). ఈ పరిషత్తు పక్షమున ప్రథమ గ్రంథముగా 'ఆదర్శ ప్రభువు' 'An Ideal Ruler' అను పుస్తకమును ఏడవ (ఇప్పటి) నిజాంప్రభువు 25 ఏండ్ల (1911-1936) రాజ్య పాలనమునుగూర్చి సీతారామయ్యగారువ్రాసి 'సిల్వర్ జూబ్లీ' (రజతోత్సవము) సందర్భమును పురస్కరించుకొని 1941 లో ప్రకటించిరి. తెలంగాణము వారికి సీతారామయ్యగారిపై ఆగ్రహము కలుగుట కీ గ్రంథము ప్రధాన కారణము కాని గ్రంథపు పీఠికను, గ్రంథమును బాగుగా చదివినచో ఈ కారణము పరి యైనది కాదనిపించును. సీతారామయ్యగారు ఉస్మానియా విశ్వవిద్యాలయములో నొసగిన (Extension Lectures) ఉపన్యాసము లాంగ్లమున 'A hand book of Telugu Literature' పేరుతో వెలువడినది. తెలుగు సాహిత్యమునుగూర్చి ఇంగ్లీషులో వచ్చిన గ్రంథములం దిది ద్వితీయమైనను గుణమున అద్వితీయము. కురుగంటివారి గ్రంథములం దత్యుత్తమమైన విమర్శనా గ్రంథము వారి "నవ్యాంధ్ర సాహిత్య వీథులు". ఈ ఒక్క గ్రంథము చాలును సీతారామయ్య గారికి చిరయశస్సును కూర్చుటకు. దానితో సరితూగగల ఆధునిక సాహిత్య విమర్శనాగ్రంథ మింకొకటి రాలేదు. నవ్యసాహిత్యమును గూర్చి మాట లాడదలచిన వారికిని, తెలిసికొనగోరు వారికిని చాలుగనైన ఆ గ్రంథమును చూడకతప్పదు. ఈ గ్రంథము వారి తండ్రిగారి కంకితముగా ప్రథమమున 1942 లో వెలువడినది. కురుగంటివారి యల్లుడగు భాగ్యమునకు నోచుకొన్న శ్రీ పిల్లలమర్రి వెంకటహనుమంతరావుగారి సవరణలతో మార్పులతో కూర్పులతో రెండవ ముద్రణము 1949 లో జరిగినది. భార్యావియోగమప్పుడు వారు వ్రాసిన 'సతీస్మృతి' పద్యములును, ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగు ఎం. ఏ. తరగతులకు పాఠములు చెప్పినప్పుడు వ్రాసిన "ఆంధ్రుల సంస్కృతి చరిత్ర" ఇంగ్లీషులో వ్రాయబడిన "The Satavahanas" అనునవి వారి యముద్రిత రచనములు. ఇంగ్లీషులో వారు 'Sanskritic Studies' పేరుతో మరియొక గ్రంథమును వ్రాసినారు. వారి 'షడ్దర్శనములు' 'దాక్షిణాత్య దార్శనికులు' మున్నగునవికూడ సాటిలేని గ్రంథములు. అప్పుడప్పు డనేక విషయములగూర్చి వారు రచించిన

వ్యాసములు "వ్యాసలహరి" యను పేరుతో నాల్గు సంపుటములుగా గ్రథింపబడి యున్నవి ఇవికూడ అముద్రితములే. గుంటూరునుండి శ్రీ పిల్లలమర్రివారి సంపాదకత్వమున వెలువడుచుండిన 'ఆంధ్ర రిపబ్లిక్' వార పత్రికలో 'కమ్మ తెమ్మెర'లను పేరుతోడను, సికింద్రాబాదునుండి శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు ప్రకటించుచున్నట్టి 'దివ్యవాణి' పత్రికలో 'తోచినట్లు' శీర్షికతోడను వెలువడిన సీతారామయ్యగారి రచనములన్నియు ఒకచోటచేర్చి ప్రకటింపదగినవి. ఇటీవల వారు 'శాతకర్ణి'యను చరిత్రాత్మక నవల నొకటి ప్రచురించిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయము సంస్కృత అకాడమీవారీ సంవత్సరమే ప్రకటించిన "పండిత రాజ కావ్యసంగ్రహము" "జ్ఞానచతుర్వింశి" "ఋగర్థసార" ముల కూర్పునందు సీతారామయ్యగారి భాగస్వామ్య మధికము. ఈ అకాడమీవారి అముద్రిత గ్రంథ ముల పట్టికలను (రెండు సంపుటములు) మరియు "క్రియాస్వరలక్షణము"ను వారే సిద్ధమొనర్చి యుంచినారు. ఇవి త్వరలో ముద్రింపబడనున్నవి.

శ్రీ కురుగంటి సీతారామయ్యగారు వివిధ ప్రత్యేక సంచికలందు ప్రకటించిన పరిశోధనాత్మక వ్యాసములు పెక్కులున్నవి.

సోమనాథ పునఃప్రతిష్ఠ జరిగిన సందర్భమున బొంబాయినుండి ఇంగ్లీషులో 'Bharatiya Vidya' అను ప్రత్యేక సంపుటము వెలువడినది. దానిలో శ్రీ సీతా రామయ్యగారు "Saivism in Andhra Country" అను అమూల్య వ్యాసమును వ్రాసినారు. దీని యాంధ్రానువాదమే 'శైవము - ఆంధ్రదేశము' పేరుతో ఆంధ్ర పత్రిక మన్మథ ఉగాది సంచికలో (1955-1956) ప్రకటింపబడినది.

ఆంధ్రేతిహాస సంశోధక మండలివారు శ్రీ మారేమండ రామారావుగారి సంపాదకత్వమున 1950లో ప్రకటించిన 'సాతవాహన సంచిక'లో 'ఆంధ్రుల విస్తరణ'మను వ్యాసమును కురుగంటివారు వ్రాసినారు. ఆకృతిలో మిక్కిలి చిన్న దైనను ఈ వ్యాసము గుణమున కడు దొడ్డది చారిత్రకులు దీని విలువను గుర్తించినారు.

ఆంధ్రసారస్వత పరిషత్తువారు (హైద్రాబాదు) 1955 లో ప్రకటించిన 'ఆంధ్ర మహాభారతోపన్యాసము' లందు కురుగంటివారు 'శాంతిత్రయము'నుగూర్చి చదివిన చక్కని యుపన్యాస మున్నది.

పై పరిషత్తువారిదే "ఆంధ్రమహా భాగవతోపన్యాసములు" 1957లో వెలు వడినది. దీనిలో సీతారామయ్యగారు వ్రాసిన "పోతన అనువాద విధానములు" అను వ్యాస మున్నది.

రెండేండ్ల క్రిందట ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగు విద్యార్థులు జరిపిన అష్టదిగ్గజ వర్థంతి సభలలో కురుగంటివారు అయ్యలరాజు రామభద్రుని గూర్చి విమర్శనాత్మకమైన వ్యాసమును చదివినారు ఈ పుస్తకము త్వరలో వెలువడనున్నది.

ఈ సంవత్సరము తొలిదినములందు కురుగంటివారు Bhavan's Journal లో నారాయణ తీర్థులవారిగూర్చి వ్రాసి ఆంధ్రేతరుల కొక ఆంధ్రమహా పురుషుని పరిచయముచేసి యున్నారు. ఇది క్లుప్తముగా కీ. శే. కురుగంటి సీతారామయ్యగారి ఆంధ్రభాషాసేవ.

కురుగంటివారు తమచుట్టు గిరిగీసికొని కూర్చుండి తమకొక పీఠమును నెలకొల్పుకొన్నవారు కారు; ప్రత్యేకవర్గమును సృజించుకొనలేదు. యువకులందు యువకులుగా వృద్ధులందు వృద్ధులుగా మెలగిన ఉత్సాహవంతులు వారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తులో వారు ప్రముఖపాత్ర వహించిరి. నాంపల్లి రామభక్త సమాజ కార్యదర్శిగా నిర్వాహకులుగా వారు ప్రదర్శించిన ఉత్సాహము యువకులందరును అలవరచుకొనదగినది. వేమనాంధ్ర భాషానిలయమునకు వారి సేవాభాగ్యము లభించినది. అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు సైనుబోర్డును కొన్నాళ్ళు మోసికొని తిరిగినారు సాహిత్యలోకమున ఇదొక్కటే ఫలించనట్టి వారు గన్నకల. మొన్నటి వరకు వారు 'నవ్య సాహితీ సమితి' కధ్యక్షులుగానుండి జరుగనున్న అఖిల భారత ఆంధ్ర రచయితల సభకు ప్రణాళికను సిద్ధముచేసినారు.

శ్రీ కురుగంటి సీతారామయ్యగా రొకప్పుడు 'భారతి' లో 'అపభ్రంశ ప్రయోగము' లను పేరుతో కొందరు కవులను విమర్శించిరి. దానికి సమాధానము వ్రాయవలయునను బాలచాపల్యముచేతను, అంతటి పెద్దలను ఎదుర్కొను ధైర్యము లేనందునను 'దేవదత్త' యను మారుపేరుతో 'స్రవంతి' శ్రీ ప్రతాపరెడ్డి స్మారక సంచిక (సంపుటి ౧ సంచిక ౯-౧౦) లో సమాధానము వ్రాసి వారి యాగ్రహము నకు కొన్నాళ్ళు గురియైతిని. కాని వారికోపము పాలపొంగువంటిది. నన్ను తొందరగనే క్షమించిరి. ఆనాడు నేనొనర్చిన యపచారము ఈనా భక్త్యంజలితో తొలగినదనుకొందును.

కురుగంటివారి ఖండితవాక్కు అందరి కలవడనిదైనను వారి నిరాడంబ రత్వము సాహిత్యకు లలవరచుకొనదగినది. తన కున్నంతలోనైనను పరులకిచ్చు నట్టి వారి యౌదార్యగుణముకూడ అంతియ. వారి యముద్రితగ్రంథములను ముద్రించుటకు శ్రీ పిల్లలమర్రివారు నడుముకట్టినారు. వారి కూతగా మనమందరము నిలిచిన చాలును కురుగంటివారి ఋణ మీగుటకు.

శాంతి శ్శాంతి శ్శాంతిః

# దిలీపుడు

—శ్రీ యోగరాజు

మండు వేసవి వడగాడ్పు టెండలందు
వాడుబాఱెను పచ్చికపట్టు లడవి
కఱవుకాలపు బెనుగాలి గలుగునాడు
నింట సిరిలేని మనుజులవంటి వగుచు.

కొంచెము దూరమేగి చలిగొండనితంబమునెక్కి ధేనువా
వంచను మేయుచుండ సలువంకల జింకలు జంకులేని నే
త్రాంచలమైన దృష్టిగన నాతడు వాటిగుణమ్ముపోల్చి భా
వించెడు నిష్టవస్తుల నిరీక్షణమధ్య నిమేషహైన్యముల్.

గౌరీశంకరులున్న యీశిఖరముఁ గంటే వియద్వాహినీ
ధారాపాతలుఠత్తరంగము రజధ్వానస్ఫురత్తాండవో
దార ప్రస్ఫుట బర్హిబర్హము దరీద్వారస్థలీసంచర
ద్ఘోరేభేంద్ర కరప్రకర్షితసరఃకూలస్థశైవాలముఁ.

ఈదారి కేదార భూదారములగుంపు
లీక్రేవ గిరిదేవి కిచ్చగొలుపు
నీచెంత విటకాంత లేకాంతవాసము
లచ్చోట వనవాటు లెసగుచోటు
లీ సీమ లభిరామ భాసోపధామము
లీప్రక్క నునుపెక్కు హిమపుజెక్కు
లీమార్గ మపవర్గ కామార్థి మునివర్గ
మీచాయ సురగేయ మెనయువసతు

లిందు పూర్ణేందుకిరణ నిష్యందచంద్ర
కాంతమణిబృంద జలపూర కలితద్రాక్ష
మంచలంబితఫలగుచ్ఛ మధురసార
పంకిలంబులు నిద్దరిప్రాంగణములు.

వాయుపూరిత రంధ్ర వంశకాండంబులు
వేణుస్వరారావ విధము జూప
రక్తకుంకుమ వనరాణి ధూళివ్యాప్తి
కాశ్మీరశాటినిగప్ప మేన
పచ్చకప్రపనంటిబాదులు బుపొప్పడుల్
చక్షులం దుష్ణము శమనయింప
చందనాగురుతరు చయము వాతసహాయ
మున నాసికామోద మొనరజేయ
నుత్తమ క్షత్రియాన్వయు డుర్వీపాలు
డావు కాపరియగు చిట కాగమించె
ననుచు గాబోలు నానావిధాగమాళి
కాఙ్క్ష నిడెనేమొ యారామకాంత ప్రేమ.

చలిమలలోయలో బసరు జాయపుదీవెలు వన్నెవన్నెలుఁ
గలిసిన బూవుమంజరులు గమ్మనవాసన లుప్పతిల్ల మేఁ
జలజలరాలె నావిభుని చట్టులరేకు హిమాలయోర్వికిఁ
బలురతనాల ఠాలుగమి ప్రాగభిషేకమొనర్చుకై వడిఁ.

కమ్మ కస్తురి దుమ్ము జిమ్మె నాభుల జీటి
మృగములు నాతేని మోమునందు
పునుగు జవ్వాదుల బొడి పూత్కరించెను
తదురఃకవాటపు దలము నవియు

కరికుంభములుజీల్చి కాళ్ళము త్తెమ్ముల
జిల్కె తద్గళమున సింహగణము
కుంచె వాలమ్ముల సంచలింపగజేసె
చమరీమృగంబులా జనపు ప్రక్క
మదగజమ్ములు సరసి నిమగ్నమించి
పద్మినీలతకరముల బట్టివేయ
నెత్తె నారాజు గుత్తుక నెసగ మహిని
విదుష లెటనున్న బూజ్యత వెలయుగాదె.

పచ్చని పచ్చిక గలదని
చెచ్చెర నాధేను వతని జేరువమూమిఁ
మచ్చిక నటునిటు దిరుగుచు
జొచ్చెను స్ఫటికాశ్మకాంతి శోభితగుహలో.



# సూక్తులలో విమర్శ

— "స్ఫూర్తిశ్రీ"

## ౧

విమర్శనము మానవ స్వభావము. పసి పిల్లలు సైతము తమ యిష్టానిష్టములను నిర్దిష్టముగా నేర్పఱచికొనియుందురు. ఏవేని యాటబొమ్మలను వారి ముందుంచిన యెడల తమ కిష్టమైనవానిని తీసికొని, తక్కినవానిని త్రోసివేయుదురు. అట్లే కొన్ని తినుబండారముల నిచ్చినయెడల కొన్నిటియం దెక్కువ మక్కువ చూపుదురు ; కొన్నింటిని స్పృశింపనే స్పృశింపరు. ఒక యాటబొమ్మ యందు గాని, ఒక తినుబడి పదార్థమునందు గాని ప్రత్యేకమైన యాసక్తి కలుగుటకు కారణముండకపోదు ; కాని, దానిని విడమరచి చెప్పలేకపోవచ్చును. ఈవిధముగా తమకు నచ్చిన వస్తువులను సేకరించుకొనవలయునను సంగ్రహణ దృష్టిని మానవుడు వయసుతో పాటుగా వృద్ధిపొందించుకొనును.

అంతియేకాదు, ఏదేనియొక క్రొత్తవస్తువు కనిపించినదనుకొందము. దాని స్వరూప స్వభావములను దెలిసికొనవలయుననియు, దానివలని ప్రయోజనమును గుర్తింపవలయుననియు నుత్కంఠనొందును. దానినిగుఱించి యాతని హృదయమున నెన్నియో ప్రశ్నలుదయించును. ఇదియేమి ? ఎట్లు కలిగినది? దీని స్వరూప మేమి ? ఇందు గల యంశీభూతము లేమి ? దీనివల్ల ప్రయోజనమేమి ? దీని నుపయోగించుటకు కావలసిన యర్హత యేమి ? ఇది యందరకు నొకేవిధమగు ఫలము నిచ్చునా ? వ్యక్తిని బట్టి ఫలము కూడ భేదించునా ? - ఈవిధముగా అనేక ప్రశ్నల నూహించుకొనుట జిజ్ఞాస గల మానవునికి స్వభావము.

అట్లే మానవుడు కొన్నిటియందొక విశిష్టమైన ఆత్మీయతను జూపుచుండును. తన దేశమన్నను, తన భాష యన్నను, తనకు సంబంధించిన వ్యక్తులన్నను వస్తువులన్నను మానవుడు సాధారణముగా నితరములకంటె విశేషముగా జూచును. "కాకిపిల్ల కాకికి ముద్దు" అన్న సంగతి మనము విన్నదియే కదా ! ఆత్మీయత యున్నచోట ఆధిక్యమే కాని, అల్పత్వము కన్నుల కగపడదు. అటివాడు తాను మెచ్చుకొనుటతో సంతోషింపడు ; ఇతరులుకూడ తాను మెచ్చుకొన్న వస్తువులనే వ్యక్తులనే మెచ్చుకొనవలయుననియు, తాను నిరసించిన వానినే నిరసింపవలయుననియు ఒక యహంభావమును గలిగియుండును. అట్లితరులు గూడ తన్ననుసరించునట్లు చేసికొనుటకు జేయు యత్నము మానవ స్వభావ సంజనితమగు అహంభావమునకు సూచకము.

మానవునకు స్వభావములయిన సంగ్రహణము జిజ్ఞాస, ఆత్మీయత యను మూడు గుణములే సాహిత్య విమర్శనమునకుగూడ మూలస్తంభములైన వనవచ్చును. కాని వ్యక్తి దృష్టికంటె సాహిత్యకునిదృష్టి విస్తృతమైనది కాలయును. లౌకిక జగత్తులోనుండు సంకుచిత వర్ణ వర్గాది భేదములకు సువిశాల సాహిత్య ప్రస్థానములో స్థానములేదు. కావుననే పై మూడు గుణములును వ్యక్తి సంబంధమైన సంకుచితత్వమును వీడి సమష్టి సమ్మతముగా విశాల విమర్శన భవనమున కాధారములై నిలచుచున్నవి.

—౨

కవి కర్మయగు కావ్యమునకును, విమర్శకుని వ్యాపారమగు సమాలోచనమునకును హేతువు ప్రతిభ. ఈ ప్రతిభ త్రైకాలికము; నవనవోన్మేషము. తాత్కాలికమగు ప్రజ్ఞను బుద్ధియనియు, భూతకాలికమగు ప్రజ్ఞను స్మృతియనియు, భవిష్యత్కాలికమగు ప్రజ్ఞను మతియనియు సాహిత్యశాస్త్రులందురు. ప్రతిభ మరల రెండు విధములు. కవివ్యాపారాశ్రయమగునది కారయిత్రీ ప్రతిభ; విమర్శక వ్యాపారాశ్రయమగునది భావయిత్రీ ప్రతిభ. కారయిత్రి నిర్మాణాత్మకము; భావయిత్రి విమర్శాత్మకము. కారయిత్రీ ప్రతిభా సంపన్నులు కవులగుదురు: భావయిత్రీ సంపద్విలసితులు భావకులగుదురు. ఒక్కనియందే యీ రెండు విధములైన ప్రతిభ యుండునా? ఉండరాదను నిషేధములేదు. క్వాచిత్కముగ నుండును. సాధారణముగ నొక్కనియందొక్కటే ప్రాధాన్యము వహించియుండును. కాళిదాసాదులు కవులుగనే ప్రసిద్ధులు. మమ్మటాదులు భావకులుగనే లబ్ధప్రతిష్ఠులు. ఆనందవర్ధన రాజశేఖర జగన్నాధాదులు సంస్కృత సారస్వత జగత్తున కావ్యశాస్త్రోభయాధ్వనీనులు.

కవి కావ్యమును వ్రాయును. భావకుడు కవి కావ్య సౌందర్యమును స్వయముగా భావించి, యాస్వాదించి, సరసులగు పాఠకులకు వెల్లడించును. కావ్యమునకు లోక ప్రియత్వమును సముపార్జించుటలో సమర్థమైన యార్జవము గలవాడు భావకుడు. భావకుని హృదయ ఫలకమున ముద్రితమైన కావ్యమే కావ్యము. కాని, ముద్రణయంత్ర సాహాయ్యమున ముద్రితమై ప్రకటితమైనంత మాత్రమున దేనికిని గావ్యత్వమురాదు. భావకుడు కవి కేమైనను గావచ్చును. ప్రభువుగా, మిత్రుడుగా, మంత్రిగా, శిష్యుడుగా, గురువుగా—ఇంక నెన్ని విధములుగానైన కావచ్చును. కవి నిక్షేపించిన భావరత్నములను వెలికికిలాగి, మెరుగులుదిద్ది లోకమునకు ఆలోకప్రభ నందిచ్చు భావకుడెంతవాడు కాకుండును! ఒక్కొక్కప్పుడు భావకుని ప్రతిభ కవి ప్రతిభను గూడ నతిక్రమించి అందములు దిద్దును. దానిని నిరూపించు చక్కని కథ యొకటి కలదు. చూతము-

ఒకమాటొక కవి యొకచోట ఒక విమర్శకుని కలిసికొనుట తటస్థించినది. కవికి లోలోపల నొక విధమగు గర్వము. తాను కావ్యమును సృష్టించును. సృష్టికర్త యగు తనకే కావ్యగతమగు సర్వ సౌందర్యమును దెలియుననియు, కావున నితరులకంటె తనకు విశిష్టత యున్నదనియు నతవి యుద్దేశము. శాస్త్రము తనకు స్వాధీనమై యున్నందున కావ్యగుణ దోష నిర్ణయముచేయు నధికారము తనకేయున్నదని విమర్శకుని యహంభావము. వారి వాదము క్రమక్రమముగా చిలికి చిలికి గాలివానయైనది. విమర్శకునికి విసుగుపుట్టినది ఓర్పు సన్నగిల్లినది. "కవిగారూ! ఈ వాదములకేమి? ఏదేని మీ క్రొత్త కవిత విని పింపుడు! కొంచెమునే పాలకించి యానందింతును" అన్నాడు. కవి కింతకంటె కావలసినదేమున్నది? ఆనందముతో అకసమంటినాడు. తాను వ్రాసిన సరిక్రొత్త శ్లోకమును సస్వరముగా వినిపించినాడు. అది యిది—

"ఇయం సంధ్యా; దూరా
దహ ముపగతోహంత! మలయాత్,
తవైకాంతేగేహే
తరుణివదనేష్యామి రజనీమ్;

సమీరేణై వోక్తా
  నవకుసుమితా చూతలతికా
ధునానా మూర్ధానం
  నహినహి నహీత్యేవ కురుతే."

పై శ్లోకమునకు భావ మిది— ఇది సంధ్యా కాలము. నే నెంతో దూరమునుండి, మలయ పర్వతమునుండి వచ్చితిని. తరుణీ! ఈరాత్రి నీ యేకాంత మందిరమునందు గడపుదును. అంగీకరింతువా? అని యడిగిన సమీరణునికి సమాధానముగా నవకుసుమితయైన చూతలతిక 'అంగీకరింపను - అంగీకరింపను - అంగీకరింపను' అన్నట్లు తలయాడించుచున్నది.

ఇంత సరస సుందరమైన పద్యమును విని భావకుడు నిర్లిప్తముగా "కవిగారూ! నవ కుసుమిత అను విశేణము వల్ల విశేష మేమేని కలదా? మీ తాత్పర్యమేమో!"అని ప్రశ్నించి నాడు. కవికి మనస్సు కొంచెము చివుక్కు-మన్నది. "ఇంత సుందరమైన పద్యమున నీ మందున కిట్టి శంక యుదయించినదేమా!" అనిపించినది. అయినను దా నుద్దేశించిన దానిని జెప్పి యొప్పింతమను నుద్దేశముతో "విమర్శక మహాశయా! ఇందు నిగూఢమైన రహస్య మేమున్నది? అంతకు ముందే సమయము సంధ్య యని చెప్పితిని గదా! శృంగారమునకు యోగ్యమగు ఋతువు వసంతము. వసంతమునందే మామిడి పూత పూయును. కాబట్టి 'నవ కుసుమిత' యనుట వల్ల ఋతువు వసంతమని సూచన చేయు చున్నాను. తమకు నచ్చినదా?" అని కవి ముగించినాడు.

"బాగున్నది. దీని విషయమున మీరు చెప్పదలచినదంతయు చెప్పినట్లే కదా! సరి! ఇంకొక్క- చిన్న సందేహము మిగిలిపోయి నది. దానికి కూడ మీ సమాధానము దయ చేసిన సంతోషింతును. మీరు 'నహినహినహి' యని మూడుమార్లు వ్రాసితిరే! దాని వల్ల ప్రత్యేక ప్రయోజన మేమైన నున్నదా?" అని విమర్శకుడు మరల ప్రశ్నించినాడు.

కవికి నిజముగా కోపమువచ్చినది. 'ప్రయోజనము లేకపోయిన, పాదపూరణముకోసము వ్రాసితి ననుకొంటిరా? గట్టిగా నిషేధమును సూచింపవలసి వచ్చినప్పుడు ఒకటికి మూడు మారులు చెప్పుటలోని సహజత్వమును గమనింపని మీ తత్వము నా కర్థముకాకున్నది. సరి లెండు! ఇంతకు మీ ప్రశ్నలు పూర్తి యైనవా? ఇంకను మిగిలియున్నవా?" అని యడిగినాడు కవి.

"పూర్తియైనవి. కాని యొక్కటిమాత్రము మిగిలియున్నది. మీరు భావించిన సారస్య మును సమగ్రముగా నాకు చెప్పినట్లే కదా!"

"మీకు నచ్చినను నచ్చకున్నను నేను చెప్పవలసిన దంతయు చెప్పితిని. రత్నము వంటి పద్య మెదుట నుండగా, ఇంక నా వ్యాఖ్యాన మెందులకు? ఏదో తప్పుపట్ట వలయునని యడుగుటకాని దానిలోని యందము మీకుమాత్ర మర్థముకాదా?" అని కవి మూతిముడుచుకొనినాడు.

విమర్శకుడు పెదవులసందున సన్నగా నవ్వుచు "కవిగారూ! మీరు చెప్పవలసిన దంతయు చెప్పితిరికదా! ఇంక నామాటలు కూడ వినుడు! మీ కవిత్వమునకేమి? లోకోత్తరముగ నున్నది. అందులకేకదా నాకింత యాసక్తి. మీరు చెప్పినదానిలో చూతలతికను స్త్రీగాను, సమీరణుని పురుషునిగాను భావించితిరి. సమయముకూడ సంధ్య. దూరమునుండి వచ్చినవాడు గనుక తిరిగిపోవుట కష్టమే. కావున రాత్రిని అక్కడ ఏకాంత ప్రదేశములో గడప నిశ్చయించుట

కూడ యుక్తియుక్తముగా నున్నది. గాలికి చూతలతిక చిగుళ్ళు కదలుటకూడ సహజమే. దానిని నిషేధముగా నిరూపించుట చక్కని భావనకు నిదర్శనము." అని చెప్పుచునే యున్నాడు. ఇంతలో కవి యందుకొని "నేను చెప్పినదానినే కలియగ్రుచ్చి చెప్పుచుంటిరి. ఇందు మీరు సొంతముగా చెప్పినదేమున్నది? ఈ భావము కాకపోయిన ఇంక నాపద్యములో నున్నదేమి ?" అని యన్నాడు.

"సరి ! ఇంతవరకు మీరు చెప్పినదానినే చెప్పితిని. ఇప్పుడు నేను భావించిన దానిని వినుడు. 'నవకుసుమిత' అను విశేషణము వల్ల చూతలతిక పుష్పవతియని ధ్వనించుచున్నది. రజస్వలయైన స్త్రీతో సంగమము నిషిద్ధము. కాబట్టి చూతలతికయను నాయిక అనుకూలయైనప్పటికిని సమీరణుడను నాయకుని మూడుదినముల వరకు నాగవలసినదని సూచించుటకుగాను "నహినహినహి" యని మూడుమారులు నిషేధ వాచకమును పలికినది. నాలుగవ దినమున ఋతుస్నాతయైన తాను సమీరణునికి సమ్మతి చూపగలననియు ధ్వనింపజేయుచున్నది. మీరేమందురు ?" అని యెదురుప్రశ్న వేసినాడు విమర్శకుడు.

కవి యింతవరకు తాను తన కవిత్వమును గూర్చియే వినుచున్న విషయమును విస్మరించి వినుచున్నాడు. ఇప్పుడు కొంచెము స్మృతి కలిగినది. తన పద్యములో గూఢముగా ఇంత భావ మున్నదా ? యనుకొని యాశ్చర్యపోయినాడు. విమర్శకుని విశిష్టతను గుర్తించి యానందముతో నభినందించినాడు. కథ ముగిసినది.

ఈ కథవల్ల ఒక విషయము విస్పష్టమగుచున్నది. కవన విమర్శన శక్తులు విభిన్నములగుట తథ్యమే. కాని పరస్పర విరుద్ధములు గావు. పైగా నొకదాని కొకటి దోహదకారియు నగును. మేలిమిబంగారమైనను నికషోపలమున నిగ్గుతేలినపుడేకదా ! విలువను వెలువరించును. అట్లే కవిగతమైన ప్రతిభ విమర్శకోపజ్ఞకు నిలిచినపుడే విలువ గడించుకొనును. ఇంతకును బరుసవేదియు నొంపిడి రాయియు నొకే గనియందు దొరకును. పరుసవేది తాకిన ప్రతిశిలయు స్వర్ణవికారమగును. ఆ స్వర్ణమును బరీక్షించి మూల్య నిర్ధారణ చేయునది నికషోపలము. కావున కవన విమర్శనశక్తులొకే నాణెమునకున్న రెండు ప్రక్కలవంటివనియు, ఏకస్థానసంజాతములనియు స్పష్టమగుచున్నది. అనేక కావ్యపఠన సంపాదిత సంస్కారమువల్ల భావకుడు కావ్యవిమర్శనపరాయణు డగును. అనేక విమర్శన వీధీ విహారమువల్ల కవి కావ్య నిర్మాణ మర్మజ్ఞు డగును.

పెక్కురు కవులు పూర్వవరులగు కవులను గూర్చియు, తమకు గురుస్థానీయులగు కవులను గూర్చియు విమర్శనాత్మకముగ తమతమ కావ్యములం దభినందించుట పొడకట్టును. సూక్తులుగా, చాటువులుగాగూడ నెన్నియో పద్యరూప విమర్శనములు ప్రచారము నొందినవి. అందును నాంధ్రకావ్యములందు నవతారిక యొక విడువరాని యంశమైనది. దైవస్తుతి, సుకవి ప్రశంస, కుకవి నింద, కృతివిషయము, కృతిభర్తృ ప్రశంస, షష్ఠ్యంతములు వరుసతప్పక వర్ణితము లగును గదా ! సుకవిప్రశంసయందు కొందరు వినయపూర్వకముగా స్తోత్రము మాత్రము చేసిరి. కొందరు కవిత్వ కల్పనతో నుత్ప్రేక్షించిరి. ఈ యిరుపక్షముల వారును మనకు ప్రస్తుతమంత ప్రయోజనకారులు కారు. మూడవ పక్షమువారు మనకు ముఖ్యులు. వీరు స్తోత్ర

మాత్ర పరాయణులును, కవితా విలాసమాత్ర ప్రియంభావులనుగాక కవితా విధాన విమర్శన దక్షులుగా సాక్షాత్కరింతురు. ఇందు కొంద రాత్మ కవిత్వ వివేచన లోచనులు గూడ లేకపోలేదు.

## 3

ప్రసన్న రాఘవ నాటక ప్రస్తావనమునందు జయదేవ కవిచంద్రుడు తనకు పూర్వ వర్తు లయిన కవి చక్రవర్తులను గురించి యిట్లు ప్రశంసించినాడు. కవితా కామినికి భాసుడు హాసము; కవికుల గురువయిన కాళిదాసు విలాసము. ఆమె యెవరి కానందము గలిగింప కుండును-అను భావముగల యా శ్లోక మిది-

"భాసో హాసః కవికుల గురుః కాళిదాసో విలాసః, కేషాం నైషా కథయ కవితా కామినీ కౌతుకాయ."

దీని యందు జయదేవుడు భాసకాళిదాసుల కవితోత్కర్షను సహర్షముగా నిర్ణయించినాడు. హాస విలాస యుక్తయగు కామిని రసజ్ఞులకు కౌతుక హేతువగును. అట్లే కవితాకామిని భాస కాళిదాసుల వలన రసజ్ఞామోదమునందుకో గలదనుట ఆ కవిద్వయమున కున్న యాధి క్యమును నిరూపించును.

అట్లే తెలుగున వసుచరిత్ర కర్తయగు భట్టుమూర్తి సంస్కృత కవుల స్థానములను నిర్ణయించుచు పలికిన పద్యము సముచిత గౌరవ సంపాదనము గావించుకొన్నది. కవితా కన్యను వాల్మీకి పుట్టించినాడు. అత డాదికవి. వ్యాసు డా కవితాకన్యకు అక్షరాభ్యాసముచేసిన విద్యాగురువు. 'నేను-నీవు' అను చిన్న చిన్న మాటలను నేర్పినవాడు కాళిదాసు. సుకుమార మైన పలుకులు పలుకుట నేరింగించినవాడు దండి. అనఘములైన యందెల నందముగా నలంకరించినవాడు భవభూతి. సర్వ సద్గుణ ములను మప్పినవాడు మాఘుడు. రాజున కిచ్చి పాణిగ్రహణము నొనర్చినవాడు మయూ రుడు, సంపద్వైభవమును గలుగజేసినవాడు భారవి. ఇట్లు కవితాకన్య పుట్టినది మొదలు వివాహితయై సమృద్ధిని బొందిన వరకు గల యవస్థల నన్నిటిం గవితావిలాస భాసురముగ నేక పద్యమున వర్ణించిన భట్టుమూర్తి శారదా మూర్తియే యనిపించును.

"భువిఁ గవితాకన్యఁ బుట్టించె నెవ్వాఁడు
బడి నాగమములెల్ల నడపె నెవ్వఁ
డేను నీ వనుమాట లెనయించె నెవ్వాఁడు
కోమల పద లీలఁ గూర్చె నెవ్వఁ
డనఘ తులాకోటి నలరించె నెవ్వాఁడు
నిఖిల గుణంబులు నేర్పె నెవ్వఁ
డినకర సంప్రాప్తి నెసఁగించె నెవ్వాఁడు
రహినించె నర్థ గౌరవము నెవ్వఁ
డట్టి వాణీ గురుత్వ మహత్త్వ ఘనుల
ఘనులఁ బ్రాచేతస వ్యాస కాళిదాస
దండి భవభూతి మాఘ సత్కవి మయూర
భారవుల భారవుల నాత్మఁ బ్రస్తుతింతు."

వైదిక ఛందమే కాని లౌకిక ఛందము లేని కాలమున వాల్మీకి మునీశ్వరుని నోట క్రౌంచ ద్వంద్వవియోగోత్థమైన శోకము శ్లోక ముగా రూపొంది వెలువడినది. లౌకిక కవిత్వ మునకు జన్మహేతువు ప్రాచేతసుడు. బ్రహ్మ సాక్షాత్కరించి, "నీవు పల్కినది కవిత్వము. రామాయణమును రచింపుము" అని యాదే శించినాడు. వాల్మీకి యాదికావ్యమగు రామా యణమును రచియించి అమర సాహితీలోక మున నాదికవి యైనాడు.

ఆగమము లనగా వేదములు. వ్యాసుడు చిక్కులు వడియున్న వేద సంచయమును విభజించుటయే కాక, పంచమవేదమగు భారత

మును రచియించి, అష్టాదశపురాణనిర్మాతయై భారతీయ ధర్మపతాకను వినీల సుదూర విహాయసమున వెలయించినాడు.

కాళిదాసు పుంభావ సరస్వతియని ప్రశస్తి. ఒకమారు విక్రమార్కుని యాస్థానకవులు తమలోతాము స్పర్థించుకొని వాదములాడు కొనిరట! అప్పుడు సరస్వతీదేవి యవతరించి యితర కవులలోని యాధిక్య న్యూనత్వము నెరిగించినదట! కాని కాళిదాసకవినిగూర్చి యేమియు పలుకలేదు. కాళిదాసు 'నేనెవరను?' అని గద్దింపగా సరస్వతి 'నేనే నీవు' అను సర్థమున 'త్వమే వాహం నసంశయః' అని పలికినదట! దీనిని మానసమున నుంచుకొనియే కాబోలు! నేను నీవనుమాటలను కవితాకన్య కాళిదాసుకడ నేర్చుకొనెనని మూర్తికవి చమత్కరించినాడు.

దండి దశకుమార చరిత్రమును రచించెను. గద్య కవులలో నితనికొక విశిష్టస్థానము గలదు. "దండినః పదలాలిత్యమ్" అను సూక్తి సుప్రతిష్ఠితము. దానినే కోమలపదలీల గూర్చుట యనగా చక్కని నడకలను నేర్పుటగా మూర్తికవి రూపించినాడు.

భవభూతి తులాకోటినుంచి యున్నత పదమును గల్పించినాడు. ఒకమాటు కాళిదాసునకు భవభూతికి కవితా విషయమున వాదోపవాదములు జరిగెనట! అప్పుడు భవభూతి త్రాసునందు తన కావ్యము నొక సిబ్బెయందును, కాళిదాసుకావ్యము నొక సిబ్బెయందు నుంచి తూచెనట! కవితాగౌరవమున భవభూతి కావ్యము తూగినది. దానితో సరస్వతీదేవి తన లీలారవింద మకరంద బిందువును చిమ్మి కాళిదాసు కావ్యమునకు గౌరవమును గూర్చినదట! ఈ కథ నాధారముగా చేసికొనియే భవభూతి కవితాకన్యను త్రాసున దూచెనని మూర్తికవి కల్పన.

మాఘుడు నిఖిల గుణంబులను నేర్చెను. "ఉపమా కాలిదానస్య, భారవే రర్థగౌరవమ్ దండినః పదలాలిత్యం, మాఘే సన్తి త్రయో గుణాః" అను శ్లోకము పై నిర్ణయమున కాధారము కావచ్చును. మాఘుని శిశుపాల వధ యందు ఉపమార్థ గౌరవ పదలాలిత్యములకు సమప్రాధాన్యము గలదని సిద్ధాంతము.

మయూరుడు సూర్యశతకమును వ్రాసిన కవి. అతడు కుష్ఠరోగముచే బాధపడుచు తద్బాధ నివారణము నాశించి, సూర్యునుద్దేశించి యొక శతకమును వ్రాసెను. ఇనుడనగా సూర్యుడనియు రాజనియు నర్థములు. కవితాకన్యకు సూర్యకిరణ సుఖస్పర్శను గలిగించినవాడు మయూరకవి.

భారవి కిరాతార్జునీయ కావ్య రచయిత. అర్థగౌరవ మాతని కావ్యగుణము. ఇదియును సంస్కృతసూక్తి కాంధ్రీకరణమే.

ఇట్లు వాల్మీకినుండి భారవి వరకుగల కవులు కవితా గౌరవ ప్రాచుర్యముల కెట్లు కారణభూతు లయిరో క్రమానుసారముగ చిత్రించినాడు. అట్లే బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమును సృజించి, మహనీయస్థితిని గూర్చి పోషించి ప్రకటించి సొంపులు వెలయింపజేసిన నన్నయ తిక్కన శ్రీనాథ సోమన భాస్కరుల ప్రాగల్భ్యమును ప్రశంసించుచు బల్కిన పద్యము హృద్యము నన వద్యము నైనది.

"మహి మున్ వాగనుశాసనుండు
సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితి మూలమై
నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా

మహాంలై సోముఁడు భాస్కరుండు
వెలయింపన్ సొంపు వాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ
దత్ప్రాగల్భ్య మూహించెదన్."

ఆంధ్ర సారస్వత జగత్తున నుత్తరోత్తరోత్కర్షకు కారకులయిన కవుల స్థానములను మూర్తికవి యిందు నిర్దేశించినాడు. ప్రపంచమును వాగ్విభుడగు బ్రహ్మ సృష్టించును. శేషుడు మోయును. లక్ష్మీవిభుడగు విష్ణువు పోషించును. చంద్ర సూర్యులు కాంతులు వెలయించి యందగింపజేయుదురు. అట్లే వాఙ్మయ ప్రపంచమునకు నన్నయాదులని కవి ధ్వనింపజేసి, వారి ప్రభావమును బ్రతిష్ఠితము గావించుచున్నాడు.

నవ్యాంధ్ర సాహిత్యలోకమున ప్రసిద్ధిని బొందిన కవుల రచనా విశేషములను గలియగలుపుకొని వారికొక స్థాననిర్ణయము జేయుచు శ్రీ కరుణశ్రీ వ్రాసిన పద్యము ఈ పద్యము ననుసరించి, కవితా కుమారిని నవ్య సాహిత్య సింహాసనాసీనను జేసి యలంకరించి యలరించినది.

"జడయల్లి 'జడకుచ్చు'లిడ రాయప్రోలు, త
ల్లావజ్ఝల కిరీట లక్ష్మి నింప,
పింగళి కాటూరి ముంగురుల్ సవరింప,
దేవులపల్లి శ్రీ తిలక ముంప,
విశ్వనాథ వినూత్నవిధుల 'కిన్నెర' మీట,
తుమ్మల 'రాష్ట్రగాన' మ్మొనర్ప,
వేదుల నాయని వింజామరలువేయ,
బసవరాజు కొడాలి 'పదము' లొత్త,
అడివి నండూరి భరతనాట్యములు సలుప
జాషువా ఏటుకూరి హెచ్చరిక లిడగ
నవ్య సాహిత్య సింహాసనమున నీకు
ఆంధ్ర కవితాకుమారి: దీర్ఘాయురస్తు!"

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ తమ రామాయణ కల్పవృక్షము నందు కవిస్తుతి యొందు తమకు గురుస్థానములయిన యాంధ్ర కవిలోక మూర్ధమణుల కవితా విశేషముల నశేషముగ చక్కని చిక్కని సూక్తులలో సమీక్షించిరి. అనేక విమర్శకులకు కూడ అందమగు శీర్షికల నందిచ్చినది యీ పద్యము.

"ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన శిల్పపుఁ దెనుఁగుతోఁట
యెఱ్ఱన్న సర్వ మార్గేచ్ఛావిధాతృండు
పోతన్న తెలుఁగుల పుణ్యపేటి
శ్రీనాథుఁడు రస ప్రసిద్ధ ధారాధుని
కృష్ణరాయఁ డనన్య కృతి ప్రబంధ
పెద్దన వడపోఁతపెట్టి నిఖిరసంబు
రామకృష్ణుఁడు సురారామగణము
ఒకఁడు నాచన సోమన్న యుక్కివుండు
చెలిపి పదిసార్లు తిరుగవ్రాసినను మొక్క
వోని యా యాంధ్రకవిలోక మూర్ధమణుల
మద్గురు స్థానములుగ నమస్కరించి."

చెలిపి, పదిసార్లు తిరుగవ్రాసినను మొక్కవోనిది ఆ యాంధ్ర కవిలోక మూర్ధమణులే కాదు; "వ్యాఖ్యాతౄణాం శిరోమణిః" అని చెప్పికొన్న యీ కవిసమ్రాట్టు సూక్తివ్యాఖ్యలు గూడ.



*శ్రవ్య నాటిక :*

# బ్రతుకు భయం

*— శ్రీ నాగభూషణ్*

*— ఇందులో పాత్రలు —*

**ప్రసాద్ - జానకి - కాంతయ్య - ముత్యాలు - పడవవాళ్లు ముగ్గురు.**

**[ఓ వర్షాకాలం.... మేఘాచ్ఛాదితమైన ఆకాశం.... ఓ నదికి ఒకప్రక్క గట్టుమీద—]**

జానకి : మబ్బుకూడా దట్టంగాపట్టింది ప్రసాద్... ఈ పూటకు మన ప్రయాణం ఆపుకుంటే మంచిది.

ప్రసాద్ : వర్షానికే భయపడి ప్రయాణం మానుకుందామా? నాలుగువందల మైళ్ళు ప్రయాణంచేశాం... ఈ నది రెండుమైళ్ళూ దాటితే, మన ఊరి పొలిమేరలు కనిపిస్తూవుంటాయి.

జానకి : రేపు ప్రొద్దున్నే పోవచ్చునుగదా అని—

ప్రసాద్ : కాని, ఇవ్వాళ వెళ్ళడంలో వున్న ఆనందం రేపు వస్తుందా? ఇంత ప్రశాంతమైన వాతావరణంలో, నదిలో దోబూచులాడే ఆ తరంగాల వైపుకు చూస్తుంటే—

జానకి : (నవ్వి) ఆఁ...ఆఁ... కవిత్వాన్ని కొంచెం కట్టిపెట్టి కథ నడిచే మార్గం చూడండి.

ప్రసాద్ : నడవకపోతేమాత్రం ప్రమాదం ఏముంది? కథ కంచికి వెడుతుంది. మనం యిక్కడే వుంటాం?

జానకి : ఇక్కడే వుండటానికి యీ కవిత్వాలన్నీ దేనికి? ఆఁ! ఆ బోటు బయలుదేరుతుందేమో?

ప్రసాద్ : అడుగుదాం... (బిగ్గరగా) ఓ అబ్బీ! నది అవతలగట్టుకు బోటేమీ బయలుదేరదా యిప్పుడు?

పడవమనిషి ౧ : బయలుదేరేవాళ్లుంటే ఎందుకుపోదు బాబూ? అయినా బాగా ముసురేసింది. వర్షంపడ్డాదంటే కష్టం బాబూ!

ప్రసాద్ : ఎంతపని? రెండుగంటల్లో అటు చేరుకోలేం?

పడవ ౨ : ఎందుకుచేరుకోలేం గానిండి, గాలి రంయ్‌న కొడతావుంది. ఏం పయాణం సేస్తారు బాబూ? ఆడకూతురు కూడా వుందిగందా?

ప్రసాద్ : ఫరవాలేదు... మాకు సరదాగానూ వుంది... కొంచెం తొందరపని కూడా వుంది.

పడవ ౧ : ఏమో బాబూ ! అసలే నమ్మగూడని కాలం... ఎటుపోయి ఎటు వస్తాదో... రేపు పొద్దునేళ ప్రయాణం చెయ్యండి బాబూ—

ప్రసాద్ : ఎప్పుడూ పడవమీద వుండేవాళ్ళకు మీకు భయం ఏమిటోయ్ ?

పడవ ౨ : మాకేం బయం బాబూ... ఇక్కడబుట్టి ఇక్కడ పెరిగినోళ్ళకి... మీరు కాదుగూడదంటే బయలెల్లుదాం...

ప్రసాద్ : ఇంకేం మరి ? బయలుదేరండి... రా, జానకీ— (కొంచెం ఆగి) డెక్ మీదకు వెడదాంపద...

[ఓ క్షణం నిశ్శబ్దం]

పడవ ౨ : రెండు బారలు పోనీరా అన్నాయ్... తెరచాప ఎత్తుదువుగాని—

జానకి : అటుచూడు ప్రసాద్... ఆ మనుషులు బోటుకోసం కాదుగదా పరుగెత్తుతోంది ?

ప్రసాద్ : బోటుకోసమే ననుకుంటాను... అదుగో చేతులెత్తి సంజ్ఞ చేస్తున్నారు కూడాను...(బిగ్గరగా) ఓయ్ సరంగూ ! కొంచెం పడవను ఆపవోయ్... ఎవరో పడవకోసం పరుగెత్తుకువస్తున్నారు...

[ఓ క్షణం అయ్యాక]

కాంతయ్య : (వగర్చుకుంటూవచ్చి) అమ్మయ్య ! వచ్చిపడ్డాం బాబూ ! మూడా మడనించీ పడుతూ లేస్తూ వచ్చినందుకు బోటు అందింది. అంతేచాలు... అంతా ఆ అనాధరక్షకుడి దయ... లేకపోతే యీ వేళప్పుడు బోటు దొరికేదేనా ?... ఏమంటావు ముత్యాలూ ?

ముత్యాలు : అంతే దొరా ! పెట్టిపుట్టాలన్నారు చూడండి... "చెయ్యెత్తండి, లోనున్న బాబులకు కనిపిస్తా"దని నే జెప్పలా ?

పడవ ౧ : రండయ్యా.. అవతలదరికి చేరుకోదలుచుకుంటే పడవ ఎక్కి మాట్లాడుకోండి ..

కాంతయ్య : నీదంతా విచిత్రం సరంగూ ! ఏదో నీ పుణ్యామా అని బోటు అందిం దనుకుంటూవున్నా అంతకోపం ఏమయ్యా ?... ఏమంటావు ముత్యాలూ?

ముత్యాలు : అంతేగా దొరా ! కోపం కోటివిధాల చెరుపన్నారు—

పడవ-౨ : చాల్లేండయ్యా... తొందరగా కూకోండి.

కాంతయ్య : నీదంతా విచిత్రం సరంగూ ! వస్తూవుంటే నే—(లోపలకు వస్తారు) వెడదామనుకున్నాక, అన్నీ అట్లా కలిసివస్తయ్ ముత్యాలూ...ఆ అనాధ రక్షకుడు లేడూ—?

ముత్యాలు : ఎందుకు లేదు దొరా ? లేకుంటే మనకు బోటు దొరుకుతాదా ?
కాంతయ్య : ఇందాక డెక్ మీద ఎవరినో చూశాంకదూ ముత్యాలూ ? మనమూ వెళ్ళి కూర్చుందాం పద......
ముత్యాలు : చలిగాలి ఆ చెవులోంచి యీ చెవులోకి కొడుతోంది దొరా—
కాంతయ్య : (విసుగుతో) చలి అయితే వాళ్లెల్లా కూర్చున్నారయ్యా ? పద—

[పడవ ప్రయాణం చేస్తున్న చప్పుడు]

[కాంతయ్య తనరాకను సూచిస్తూ దగ్గుతాడు]

కాంతయ్య : (ఇంతలోనే పశ్చాత్తాపాన్ని సూచిస్తూ) ఓ ! ముత్యాలూ ! కిందికి పద—
ముత్యాలు : అదేం దొరా ? పైకి వెడదామన్నారు—?
కాంతయ్య : (రహస్యంగా) పైన ఎవరో వున్నారోయ్ !
ముత్యాలు : ఉన్నారనేకదా వెడదామన్నారు.
కాంతయ్య : (రహస్యంగానే) అది సరేలేవోయ్. బిగ్గరగా అరవకు.... ఎవరో మనకెందుకు ?
ప్రసాద్ : మేం ఎవరమయితే ఏం ? మీరూ ప్రయాణం చేస్తూనే వున్నారుగా ! పైకి రావచ్చునండి—
కాంతయ్య : మీరు ఏకాంతంగా వున్నారు కదా అని—
ప్రసాద్ : ఇదేమన్నా మా యిల్లా చెప్పండి, మేం ఏకాంతంగా వున్నాం, మీరు లోపలకు రాకూడదనడానికి. రండి.
ముత్యాలు : (కొంచెం ఆగి) మబ్బు దట్టంగా పట్టింది బాబూ ! ఈయేలప్పుడు బయలుదేరారేం ?
కాంతయ్య : అదేం ప్రశ్న ముత్యాలూ ? ఎవరి అవసరాలు వారివి.
ప్రసాద్ : మాకేం పెద్ద అవసరం కాదనుకోండి.... నాన్నగారు పెద్దవారయ్యారు. వారిని చూడాలని.... పైగా మావూరు అవతలిగట్టునే వుండగా రాత్రి అంతా యివతల జాగరణ చెయ్యడం ఎందుకు ?
కాంతయ్య : బావుంది... జననీ, జన్మభూమిశ్చ— అన్నారు. ఆ మమకారం అందరికీ వుంటేనా ?
ముత్యాలు : సన్నచినుకు మొదలెట్టింది. చలికూడా వేస్తోంది దొరా ! కిందికి పదండి. అసలే మీ ఒళ్ళు మంచిదిగాదు. ఏమైనావస్తే అమ్మగారు నన్ను చంపుతుంది.

కాంతయ్య : రక్షిస్తుంది.... ఇంతగా మబ్బులు పట్టినప్పుడు నామాటకూడా వినకుండా బయటకు తరిమితే లేదుగాని, నాకేమన్నా వస్తే బాధెందుకు?

ముత్యాలు : బావుందండీ— ఆవిడ వూరికే తరిమూరా? అవతల రెండువేల రూపాయలు బాకీ యివ్వాళ తీరుస్తానన్నాడా? ఇస్తానన్న వాళ్లదగ్గర ఇస్తానన్న రోజుకు రాబట్టడం వ్యాపారానికి మూలం దొరా!.... కిందికి వెడదాం పదండి.

కాంతయ్య : నీదంతా విచిత్రం. ఇంతలోనే చచ్చిపోతానా ముత్యాలూ ?... అయినా ఆ అనాధరక్షకుడికి దయకలగాలిగాని, ఆయన పిలిచిన క్షణం ఆయన సన్నిధిలోకి పోనూ ?

ప్రసాద్ : అయ్యో! ఎవరయినా అంతేనండీ! మనం ఆయన పిలిచిన తక్షణం వెళ్లకపోతే మాత్రం, ఆయన వూరుకుంటాడా? రెక్కలు పట్టుకొని లాక్కుపోడూ ?

ముత్యాలు : మరే దొరా, బాగా చెప్పారు.

కాంతయ్య : చెబితే చెప్పారుగాని, ఓ తత్త్వం పాడు. అసలు యిటువంటప్పుడే భక్తిగీతాలు పాడుకోవాలి... మీరు వినలేదుగాని, మా ముత్యాలు తత్త్వాలు గొప్పగా పాడుతాడు లెండి.

ముత్యాలు : చలివేస్తోంది బాబూ!

కాంతయ్య : మాటవరుసకి అడుగుతున్నాను— చలి దేనికి ముత్యాలూ? ఈ శరీరానికేగదా! శాశ్వతంకాని శరీరానికి చలి అని ఆత్మను కూడా ముడిచిపెట్టుకుంటామా? ముత్యాలూ?— ఆ ఆత్మకు చలేమిటి? పాడు.

జానకి : (నెమ్మదిగా) ఈయనగారికి వేదాంతం నరనరాల్లోకీ ఎక్కినట్లుగావుందే!

కాంతయ్య : ఏమిటి అమ్మాయిగారు అంటున్నది?

ప్రసాద్ : అబ్బే! ఏమీలేదు. మీరు పెద్ద వేదాంతుల్లా వున్నారంటోంది.

కాంతయ్య : ఏదోలెండి... మా అన్నయ్య పెళ్ళిచేసుకున్న రెండేళ్ళకే వద్దన్నా వినకుండా సన్యాసుల్లో కలిశాడు లెండి... ఆయనదగ్గర అడపాదడపా కూర్చుంటూవుంటాను... ఆఁ! ఏదీ ముత్యాలూ! ఓ తత్త్వం ఎత్తుకో.

ముత్యాలు : (పాటపాడతాడు)—

నరజన్మమిక దుర్లభమురా!
సాజన్మ సాకార సద్గురుని కనరా ॥న॥

[ఉరిమిన చప్పుడు—గాలి తీవ్రంగా వీస్తుంది]

జానకి : చూశావా ప్రసాద్... గాలి, వాన ఎంత ఉధృతంగా వస్తోందో ?
ప్రసాద్ : చినుకు కూడా పెద్దదవుతోంది. లోపలకు పోదాం పద.
జానకి : నాకు పడవ ప్రయాణం అంటేనే భయం ప్రసాద్ ! పోనీ ఈ పూటకు వెనక్కు తిరిగి ఆ ఒడ్డుకు వెళ్ళిపోదామా ?
ప్రసాద్ : పిచ్చా ఏం జానకీ నీకు... లోపలకు పోదాం, పద.
ముత్యాలు : మీరూ పదండి దొరా, వేదాంతం చెప్పక—
కాంతయ్య : నీదంతా విచిత్రం ముత్యాలూ ! ఎందుకు వెళ్ళను ? అందులోనూ వర్షం మొదలెట్టాక ?

[గాలీ, వర్షమూ ఉధృతంగా వస్తున్న చప్పుడు]

పడవ ౧ : అన్నా ! అట్ట దిగువకుపోనీ— అటునుంచైనా బోటు వాలుకు నడుస్తాదేమో—
ముత్యాలు : (ఓ క్షణం ఆగి)

గూటిలో చిలకేదరన్నా,
గూడు చిన్నా బోయెరన్నా ॥గూటిలో॥

కాంతయ్య : చిలక ఎక్కడికీ పోలేదు. వూరుకో ముత్యాలూ— చస్తుంటే సంధిమంత్రమని నీ వేదాంతం ఏమిటి ?
ప్రసాద్ : అదేమిటండీ పాపం ! మీరేగా పాడమన్నారు.
కాంతయ్య : ఇందాక ఏదో గుబులుగా వుంటే పాడమన్నాను. అవతల ముంచుకొస్తుంటే పాటేమిటండీ ?
ప్రసాద్ : ఏం సరంగూ ! వర్షం పెద్దది కాకముందు అవతలకు చేరగలమంటావా ?
పడవ ౨ : చూస్తూనేవున్నాం బాబూ ! వాలుకు పోవడంలేదు బోటు—
కాంతయ్య : చూశావా ! ఆ వురుములు, మెరుపులు— ఎక్కడా కనుచూపు మేరలో గుడ్డివెలుతురు కూడా కనిపించడంలేదు.
ముత్యాలు : ఆ మొదటెందుకు నుంచుంటారు దొరా— గాలి మా రివ్వున వీస్తోంది.
పడవ ౧ : పడవలో అటూ, ఇటూ కదలకండి బాబులూ ! నిలవడంలేదు పడవ.
జానకి : తెరచాప దించుతున్నారేం ?
పడవ ౨ : పెద్ద చాపకి పడవ ఆగడంలేదమ్మా... వానకూడా పెద్దదయింది.

[వర్షం పెద్దదైన చప్పుడు...గాలి]

[కొంచెంసేపు విరామం]

ముత్యాలు : తుఫానులా వుంది బాబూ!

కాంతయ్య : నీ మొహం. వూరుకుండు! శనిలా దాపురించావు. తీసుకు రావడం పొరపాటైంది.

ముత్యాలు : అదేమిటి బాబూ! నేను లేకపోతే బోటు అందేదేనా మీకు?

కాంతయ్య : అంది అఘోరించింది ఏమిటోయ్? అందకుండావుంటే కడుపులో చల్ల కదలకుండా యింట్లో పడుకొనివుండేవాడిని!

ముత్యాలు : ఇంట్లో పడుకుంటే యిస్తానన్న బాకీ ఎట్లా వసూలౌతుంది? అయినా మీరు పడుకుంటానంటేమాత్రం బాకీ వసూలు కాకుండా అమ్మ గారు పడుకోనిచ్చేదా?

కాంతయ్య : నీదంతా విచిత్రం ముత్యాలూ, లేకపోతే వురితీస్తుందా యేం?

[ఓ క్షణంపాటు భయంకరమైన నిశ్శబ్దం. తిరిగి కల్లోలం. వర్షం నదిలో పడడంవల్ల, గాలివల్ల కలిగిన సంక్షోభం.]

జానకి : ప్రసాద్! తొందరపడి వచ్చామేమో ననిపిస్తోంది నాకు.

ప్రసాద్ : కానీ! వచ్చాక అనుకొని లాభం ఏముంది?

జానకి : ఏమిటో ప్రసాద్! ఇదివరకు ఇటువంటి ప్రమాదాలు జరిగాయంటే ఆశ్చర్యపడేదాన్ని. ప్రాణాలు పోయాయంటే జాలివేసేది. కాని... ఇప్పుడు భయం— గుండెల్లోనుంచి వణుకు పుట్టుకువస్తోంది ప్రసాద్...

ప్రసాద్ : భయపడి ప్రయోజనం ఏముంది జానకీ! ఆ విషయాలు అనవసరంగా జ్ఞాపకం తెచ్చుకోకు. కానున్నది కాక మానదు కదా!

పడవ-౧ : భద్రంగా కూర్చోండి బాబులూ! చిన్న చాపకూడా చిరిగిపోయింది. బోటు వూరికే ఊగిపోతోంది...

[భీకరమైన సంక్షోభం]

జానకి : (గాద్గదికంగా) జీవితాన్ని గురించి ఎన్ని కలలు కన్నాం ప్రసాద్!

ప్రసాద్ : ఆ కలల్ని నిజం చేసుకోవడానికి ఆయుర్దాయం వుండాలి జానకీ!

జానకి : ప్రసాద్! మన పెళ్లి అయి ఎన్నాళ్లయింది?

ప్రసాద్ : అదుగో! అనవసరంగా ఉద్రేక పడకు జానకీ!

జానకి : ఉద్రేకం కాదు ప్రసాద్... చెప్పు. రెండేళ్లయిందా?

ప్రసాద్ : ఇంకా కాలేదు. ఏం?

జానకి : ఈక్షణంలో యీ పడవ మునిగిపోతే !— ఓ ! ప్రసాద్ ! జీవితంలో అన్ని ఆనందాలూ మీతో పంచుకొని, సంసారాన్ని స్వర్గంగా చెయ్యాలని- ఎన్ని కలలు కన్నాను !

ప్రసాద్ : వాటిని కలల్లోనే వుండనీ జానకీ. ఆ పిచ్చి ఆలోచనలు రానివ్వకు.

జానకి : నీకు తెలియదు ప్రసాద్. మాతృత్వంలో స్త్రీ ఎంత పరిపూర్ణత పొందు తుందో నీకు తెలియదు... అది మా జీవితాల ఆదర్శం. మా బ్రతుకుల ఆనందం......

ప్రసాద్ : జానకీ ! కలలు ఎవరికి మాత్రం వుండవు ? ప్రమాదాల్లో చనిపోయే లక్షలాది జనానికి ఆశలు ఉండవా ? వారుమాత్రం వారి కలలు నిజం కావాలని ఆరాటపడరా, చెప్పు ? కొందరికి ఆ అదృష్టం వుంటుంది. కొందరికి వుండదు...(కొంచెం ఆగి) ఎందుకు జానకీ అలా వణికిపోతావు ?

జానకి : నాకు గుండెల్లో అదురుగా వుంది ప్రసాద్.... కాలు నిలవడం లేదు.

ప్రసాద్ : ధైర్యం తెచ్చుకో జానకీ.... ఈ గాలివాన ఉధృతం తగ్గుతుంది. మరో గంటలో మనం మనవూరు చేరుకుంటాం.

జానకి : (ఉద్రేకంతో) లేదు ప్రసాద్, లేదు. మన జీవిత నాటకాల్లో యిది ఆఖరు రంగం. తరువాత తెర, నాటక పరిసమాప్తి. అంతే !

ప్రసాద్ : ఇన్నిసార్లు అలా అనుకోవడంవల్ల ఏమైనా లాభం వుందా ? ఇలా దగ్గరకువచ్చి కూర్చో.

కాంతయ్య : భయం లేదమ్మా ! అయినా మనం ఏం చెయ్యగలం ? అంతా ఆ అనాథరక్షకుడి దయ. ఏమంటావు ముత్యాలూ ?

ముత్యాలు : మరే దొరా ! చావుమీద భయం పుట్టి పారిపోతే మాత్రం దాని నుంచి తప్పించుకోగలమా ?

[భయంకరంగా గాలి వీస్తోంది. బరువుగా వర్షం పడుతోంది.]

పడవ-౨ : బాబులూ ! ఈ దరికి రాకండి. చుక్కానికి అవతలిదరిని కూకోండి.

కాంతయ్య : నీదంతా విచిత్రం సరంగూ ! అవతల అంత అట్టహాసంగా ముంచుకు వస్తూవుంటే లోపల బిక్కుబిక్కుమంటూ కూర్చుంటే ప్రాణం కడబట్టదూ ? ఏమంటావు ముత్యాలూ ?

ముత్యాలు : బయటకు చూసినా అంతే దొరా ! అదుగట్టు చూశారా ! ఎంత లేసి చెట్లూ, అవీ కొట్టుకొస్తున్నాయో ! ఈ వాన యిహ తగ్గదు బాబూ!

కాంతయ్య : పోనీలే ముత్యాలూ ! చావంటే నాకు ఎప్పుడూ భయంలేదు. ఈ కాయం శాశ్వతం కాదుగదా ! ఇవ్వాళ కాకపోతే రేపైనా పోవలసిందే !

ముత్యాలు : అదేమిటిలే దొరా ! ఇవ్వాళ, రేపు ఒకటేనా ? మీరు రాకపోతే అమ్మగారు ఎంత దిగులుపడతారో ఆలోచించారా ?

కాంతయ్య : నిజమేననుకో ! అయినా ఇన్నాళ్ళూ మీ అమ్మగారు నన్ను వేధించిన పాపం వూరికే పోతుందా ?

ముత్యాలు : అదేమిటి దొరా ! అప్పుడప్పుడు అమ్మగారు మిమ్మల్నేమన్నా అన్నా, అమ్మగారి మనసు వెన్నపూస కాదుటండీ ?

జానకి : ఆయన మాటలు వింటున్నావా ప్రసాద్ ! స్త్రీలంటే మగవాళ్ళకు ద్వేషం ఎంతగా వుందో !

కాంతయ్య : మీకు తెలియదమ్మాయ్ ! చెబితే నమ్మరుగాని—తాటకి అనుకోండి.

ప్రసాద్ : మీరు తయారుచేసిన తాటకే కావచ్చునండీ !

కాంతయ్య : అన్యాయమండీ ! మా ఆవిడ సంగతి తెలిస్తే మీరిట్లాఅంటారా ? పోనీలెండి... ఇంతకూ దాని అదృష్టమా అని, వచ్చివచ్చి యింత గండంలో చిక్కుకున్నాను.

ముత్యాలు : అమ్మగారి చలవవుంటే యీ గండంగడచి బైటపడొచ్చు దొరా !

కాంతయ్య : బయటపడినట్లేవుంది ముత్యాలూ! (కొంచెంభయంతో) మేఘాలు చూడు ! రాక్షసుల్లా వున్నాయ్....అదుగో ! ఆ మెరుపులు చూశావా? రాక్షసుడి కోరల్లా భయపెడుతున్నాయి... ఇహ లాభంలేదు, ముత్యాలూ !...పడవ నీటిమీద నిలవడంలేదు కూడాను.

పడవ ౧ : చుక్కాని ఆగడంలేదురా చిన్నా—పడవ ఏ మొయికి తిప్పినా లాభం లేకుండావుంది. నువ్వొచ్చి యీడ కూచో, గడ నే వేస్తాను.

కాంతయ్య : అదుగో ! చుక్కాని నిలవడంలేదు. ఇహ మన ప్రాణాలకి నీళ్ళు వదులుకోవలసిందే !

ముత్యాలు : అఘాయిత్యం మాటలనకండి దొరా ! ఏం ఫరవాలేదు.

[ఓ క్షణం నిశ్శబ్దం....హోరున గాలి, వాన వీస్తున్నది.]

ప్రసాద్ : (మెల్లగా) జానకీ ! మనం పొరపాటున బయలుదేరాం కదూ ?

జానకి : అదేమిటి ప్రసాద్ ?

ప్రసాద్ : అవును జానకీ! నువ్వీ ప్రయాణం వద్దని మొదటినుంచీ చెబుతూనే వున్నావు... నేనే మంకుపట్టుపట్టి—

జానకి : అబ్బే! నాకుమాత్రం త్వరగా యింటికివెళ్ళడం యిష్టంకాదా ప్రసాద్?

ప్రసాద్ : అయితే ఏం? నీ మాట విని ఆగిపోయివుంటే, ఏనాటికైనా మన వూరు వెళ్ళి... నాన్నను చూడగలిగేవాడిని... నాకా అదృష్టం లేదు జానకీ!

జానకి : నిజమే ప్రసాద్... ఈ రోజు కోసం— మామగారిని, మీ వూరును చూడాలని—ఎంతగా ఎదురుచూస్తున్నానో?

ప్రసాద్ : కాని లాభం?...తప్పుచేశాను జానకీ! నీ మాట విననందుకు తగిన శాస్తి జరిగింది—

జానకి : అలా అనకు ప్రసాద్!....ఏం జరుగనున్నదో మనకుమాత్రం తెలుసా?

ప్రసాద్ : తెలుసు జానకీ! స్పష్టంగా తెలుసు... ఇన్నాళ్ళ తరువాత, మొదటి సారిగా భార్యతో మా ఊరు పోతున్నాను, నాన్నను చూస్తాను— ఈ భావం నన్ను గుడ్డివాడిని చేసింది... (జాలిగా) కడసారిగా, ఒక్కసారి, నాన్నను చూడగలనా జానకీ?

జానకి : (వారిస్తూ) ప్రసాద్...

ప్రసాద్ : నాన్న! చిన్నప్పటినుంచీ తన చేతులతో ఎత్తి పెంచాడు... ఆయన అనురాగాన్ని రంగరించి నాకు పాలు పట్టాడు...ఆయన కలలు, ఆయన ఆశలు ప్రోదిచేసి నాలో దాచుకున్నాడు... ఇన్నాళ్ళూ ఆయనకు ద్రోహమే చేశాను జానకీ!... నావంటి కృతఘ్ను డెక్కడయినా వున్నాడా?

జానకి : ఏమిటి ప్రసాద్ ఆ మాటలు?

ప్రసాద్ : అవసానకాలంలో ఆత్మపరీక్ష జానకీ! ఇంకా వంచన ఎందుకు? నా పశ్చాత్తాపం నన్ను దగ్ధుణ్ణి చెయ్యకముందే ప్రకృతి నన్ను బలి తీసుకుంటోంది—

జానకి : భయంలేదు ప్రసాద్!...గాలివాన తగ్గుతుంది. మనవూరు వెళ్ళి మామ గారిని చూస్తాం...

ప్రసాద్ : లేదు జానకీ!...ఈజన్మకు ఆ ఆశ లేదు. దుర్గమాంధమృత్యుదుర్గశిఖరం మీద వున్నాం...మానవ మార్కండేయగళాన యమపాశం పెనవేసుకు పోతున్నది.

జానకి : (గాద్గదికంగా) ఏమిటిది ప్రసాద్ !... నాకు భయం వేస్తోంది.... ఇటు చూడు— నేను నీ ప్రక్కనే వున్నాను. ఏం జరిగినా యిద్దరం కలిసే వుందాం.

కాంతయ్య : అవేం మాటలమ్మా! మీరిద్దరూ జీవితంలో చాలినంత అనుభవం లేదుకనుక బ్రతకాలనుకుంటున్నారు.... కాని అనుభవంచూపేది ఒక్కటే ఆశ తెలుసా! మృత్యువు— అంతే! ఏదో చుట్టంచూపుగా వచ్చాం, పోతున్నాము అనుకోవాలిగాని—ఏమంటావు ముత్యాలూ!

ముత్యాలు : అంతేగా దొరా మరి!

జానకి : నాకు భయంగా వుంది ప్రసాద్!...

ప్రసాద్ : బ్రతుకు భయంకోసమే జానకీ! కలల్లో కనిపించినవన్నీ ఎండమావులు... నిర్మించుకొనే ఆదర్శసౌధాలకు పునాదులు వుండవు. కల్పించుకున్న అనురాగ రాగం అపశ్రుతి పలుకుతుంది. ఇక బ్రతుకు భయం కాక, మరేమిటి జానకీ ?

[ఓ పెద్ద వురుము.... పడవలో అందరూ అరుపు.]

జానకి : (భయంగా) ఏమిటది ?... ఏమైంది?

పడవ-౨ : బోటుకు చిన్న బెజ్జం పడ్డదమ్మగారూ !

జానకి : ఆఁ ! బెజ్జమే ! ఎట్లా ?

పడవ-౧ : ఎట్లాగేముందమ్మా ? పాణాలకు తెగించి చూస్తాం.... ఆ పైన ఏరు తల్లి వుంది, పైన బగమంతుడే వున్నాడు.

కాంతయ్య : [భయంగా] బెజ్జఁవే పడ్డదీ ! ఓయి ఆపద్బాంధవా ! అనాథ రక్షకా ! నేరక వచ్చానయ్యా ! ఎట్లా ముత్యాలూ ? చూస్తూ వూరుకుంటావేం ?

ముత్యాలు : పోనీ, మనమూ నీళ్ళు తోడి పారబోద్దాం, రండి దొరా!

కాంతయ్య : ఓయి నీ పారబొయ్యడం ఏగలడ—తప్పించుకొనే మార్గం చూడవయ్యా అంటే—

ముత్యాలు : ఎట్లా దొరా !

ప్రసాద్ : ప్రమాదం ముంచుకు వస్తోంది జానకీ ! అయినా నాన్నను చూడలేక పోతున్నానన్న ఒక్కబాధ తప్ప నాకు మరే బాధా లేదు యిప్పుడు.

కాంతయ్య : ఏం సరంగూ !— ఏమీ దోవ లేదూ ? మా ఆవిడచేత వంద రూపాయ లిప్పిస్తాను. కాదు, కూడదంటే ఏటి అవతల బాకీలో వసూ లయ్యే రెండువేలూ నీకిప్పిస్తాను.

పడవ : మేం చెయ్యగలిగింది చేస్తాం బాబూ ! ఏరు మాంచి మోపుమీద వుంది... చుక్కానికూడా నిలవడంలేదు.

ముత్యాలు : ఏంచేస్తాం!........ మన ఋణం తీరింది.

కాంతయ్య : నీ మొహం.... ఈయేడు రెండుపుట్ల ధాన్యం నిలవచేశాను. నేను లేకపోతే ఎట్లా ? నేను లేకపోతే, ఆ రాఘవయ్యకి వెయ్యిరూపాయలు అప్పు యిచ్చాను, వాడిస్తాడా ? ముత్యాలూ ! నీకు తెలియదు. నేను బ్రతకాలి.... నేను బ్రతికి తీరాలి.

పడవ-౨ : ఎంత తోడినా నీళ్ళు మోకాలు లోతున నిలుస్తున్నాయ్. ఇక లాభం లేదు.

జానకి : ప్రసాద్ !.... ఇలా దగ్గరగా రా—

ప్రసాద్ : మనం ఎంత అదృష్టవంతులం జానకీ ! బ్రతికివుంటే వూళ్ళు ఏలవచ్చు. కోట్లు సంపాదించవచ్చు— కాని ఇద్దరం ఒక్కసారిగా చనిపోయే అదృష్టం కలిగేదా ?

జానకి : అవును ప్రసాద్!.... ఆ అదృష్టం ఎందరికి వుంటుంది ? నేను స్త్రీని— అంతకంటె ఎక్కువ ఏం కోరుకుంటాను ?

ప్రసాద్ : నేను మాత్రం ? వెయ్యి జన్మల తపసు ఫలితం యిది జానకీ !

కాంతయ్య : సరంగూ ! నీకు పుణ్యం వుంటుంది, రెండువేలు కాదు పదివేలిస్తాను. పుట్టే పిల్లలకి నీపేరు పెట్టుకుంటాను.

పడవ-౧ : చెయ్యగలిగితే మేం మాత్రం చెయ్యమా బాబూ ?

పడవ-౨ : చిన్నా ! ఇక బోటు లాభం లేదురా— పదేళ్ళు కాపాడింది మనల్ని. ఇయ్యాళ మనరోజులు బాగులేవు— పడవ నిలవడం లేదు. అంతకంతకీ లోపలకు పోతోంది—

కాంతయ్య : ముత్యాలూ ! నేను బ్రతకాలి.... నాకు ఏదో ఓ తోవ చూపించు— నేను లేకపోతే నా డబ్బు ఎట్లా— నేను చావను.

ముత్యాలు : చావనంటే కుదురుతుందా దొరా ! ఆ వేదాంతం అంతా మీ రేగా చెప్పింది. మళ్ళీ చావంటే భయపడతారేం ?

కాంతయ్య : నోరుముయ్.... నీ వుపన్యాసం ఎవడికి కావాలి ? అదుగో— మునిగిపోతోంది.... అమ్మో ! నేను చావలేను.... చావను ...

జానకి : ప్రసాద్ ! ఈ ఆఖరుక్షణాల్లో నా దగ్గరే వుండు— ప్రసాద్ ! ఇప్పుడు నాకు చావంటే ఏమీ భయం లేదు.

ప్రసాద్ : (విషాదంగా నవ్వి) జానకీ ! ఈ క్షణాన మృత్యువుకన్న ఆత్మ బంధువు లేదు.

జానకి : నా చేయి వదలకు ప్రసాద్.

ప్రసాద్ : (గాద్గదికంగా) జానకీ ! ఇవి మన ఆఖరు గడియలు... వచ్చే జన్మ అంటూ వుంటే— తిరిగి మనం ఇద్దరం భార్యాభర్తలం కావాలని ప్రార్థించు.

జానకి : (ఏడుస్తూ) ప్రసాద్ !

ప్రసాద్ : ఛా ! ఏడుస్తున్నావా జానకీ ?

జానకి : లేదు ప్రసాద్.... నా ఆనందాన్ని, అదృష్టాన్ని అభినందించుకుంటు న్నాను. మరి వెయ్యి జన్మలకు కూడా నువ్వే నాకు సర్వస్వమూ కావాలి ... అదే నా చివరి కోరిక.

ప్రసాద్ : (ఆప్యాయంగా) జానకీ !

కాంతయ్య : అయిపోతోంది.... ఇహ పోతున్నాను. పడవవాళ్ళూ ! నన్ను నన్ను రక్షించరూ ! ముత్యాలూ ! నీకు పుణ్యం వుంటుంది, చచ్చి నీ కడుపున పుడతాను. నన్ను బ్రతికించు.

[దూరంగా ఏదో శబ్దం, ఇంజను నడిచే చప్పుడు]

కాంతయ్య : (బిగ్గరగా) అమ్మా! నన్నెవ్వరూ తీసుకుపోలేరు. నేను చావను.... నేను చావను... ఓయి ఆపద్బాంధవా ! అనాధరక్షకా !

ముత్యాలు : ఇంకేం బ్రతకడం దొరా ! యమధర్మరాజు వాహనం బుసలు కొడుతూ వస్తోంది—అదుగో ఆ చప్పుడు.

ప్రసాద్ : విన్నావా జానకీ ! యముని మహిషపు లోహఘంటలు మబ్బుచాటున ఖణేల్‌మన్నాయి....మనల్ని రమ్మని అన్యాయంగా ఆహ్వానిస్తున్నాయి.

పడవ ౧ : (త్వరగా) అదుగో—లాంచీ వస్తోంది, లాంచీ వస్తోంది.

కాంతయ్య : లాంచీనే ! అమ్మయ్య ! బ్రతికాం... ఆపద్బాంధవా ! నా మొర విన్నావా ! నీ భక్తుడిని కాపాడావు కదయ్యా !

[లాంచీ దగ్గరకు వచ్చిన చప్పుడు]

లాంచీమనిషి : ఓయ్ చిన్నా, బోటేమయింది ?

పడవ ౧ : చిల్లిపడ్డాదిరా కోటా ! మునిగిపోబోతావుంది. ఇంతలో భగవంతుడిలా వచ్చావు !

లాంచీమనిషి : మా లాంచీకూడ బాగులేదురా ! ఇంకా ఇద్దరు ఎక్కొచ్చు.

కాంతయ్య : నేను పోతాను.... నేను పోతాను.

ముత్యాలు : అదేమిటి బాబూ ! పెద్దవాళ్ళం మనమెందుకు ? ఆ అయ్యనీ, అమ్మనీ పోనివ్వండి. నాలుగుకాలాలపాటు చిలకాగోరింకల్లా బ్రతకవలసినవాళ్ళు.

కాంతయ్య : నువ్వు నోరుముయ్యరా ముత్యాలూ ! నేను బ్రతకడం నీ కిష్టం లేదూ ? ఓయ్ పడవవాళ్ళూ ! వెయ్యిరూపాయలిస్తాను— నన్ను తీసుకుపొండి.

లాంచిమనిషి : డబ్బు శాశ్వతమా బాబూ !

కాంతయ్య : మరేంకావాలి మీకు ?... ఏం కావాలన్నా యిస్తాను...మీ పేర పదెకరాల పొలం రాస్తాను. ఇంకా కాదంటే, మీ ఆడవాళ్ళకి పదువారాల నగలు చేయిస్తాను.

లాంచీమనిషి : ఏమిటయ్యా ? మేమేం డబ్బుమనుషుల మనుకున్నావేం ? పాణాలు పోతావున్నాయి గందా అని బతికించడానికి వచ్చాంగాని— రండి అమ్మగారూ, మీరూనూ, అయ్యగారూ—

కాంతయ్య : మరి నేను ?

పడవ ౧ : మీకూ ఓ తెప్పకొయ్య యిస్తాం...మాతోరండి.

కాంతయ్య : నేను యీదలేనయ్యా—దోవలో నదిలోపడితే—? వద్దువద్దు... నేను లాంచీనే ఎక్కుతాను.

జానకి : పోనీ ప్రసాద్.. పెద్దవాడు ఆయననే పోనీ— మనమే తెప్పకొయ్యల మీద పోదాం.

ప్రసాద్ : పోనీ, సరంగూ ! ఆయన్నే తీసుకుపొమ్మను.

లాంచీమనిషి : మాకు ఎవరైతేనేం ? ఆలస్యంచెయ్యక తొందరగా రావయ్యా.

[వర్షం ఎక్కువవుతుంది]

కాంతయ్య : లాంచీని దగ్గరకు రానివ్వండి కొంచెం—

లాంచీమనిషి : ఇంకా దగ్గరకు వస్తే మళ్ళీ ముందుకు వెళ్ళాలంటే, కష్టం. వెనక్కు పోవాలి. తొందరగా దూకవయ్యా—ఏరు మోపుగా వస్తోంది.

కాంతయ్య : ఎలా ?

ముత్యాలు : ప్రతిదానికీ ఎలాగంటూ కూర్చుంటే ఎలా దొరా ? తొందరగా దూకండి. లేకపోతే లాంచీ బయలుదేరుతుంది.

కాంతయ్య : దూకవలసిందేనంటావు ?

[గాలి, వాన ఎక్కువైన శబ్దం, లాంచీ యింజను మోత]

లాంచీమనిషి : తొందరగా రండి—

ముత్యాలు : పొండి బాబూ ! తొందరగా— ఊc !

కాంతయ్య : పోతున్నానయ్యా......... (ఒక్క క్షణం ఆగాక) అయ్యో ! చచ్చాన్రా—

[చివర యింకా ఏవో మాటలు, యింకా అస్పష్టంగా వినిపిస్తూ వుంటాయి...]

జానకి : అయ్యో ! నదిలో పడిపోయాడు—

పడవ-౧ : అరే మునిగిపోతున్నాడురా ! ఏటిలోకి దూకు—

పడవ ౨ : దూకితే యింకేమన్నా వుందా ? ఇక్కడ మూడు నిలువుల లోతు ......... అసలే ఏరు మోపుగా వుంది ...

ముత్యాలు : ఎట్లాగయ్యా మరి ? పోనీ నేను దూకుతాను.

పడవ ౧ : దూకితే నువ్వూ చచ్చిపోవలసిందే గాని ఆయనని బతికించలేవు. తెప్ప లేకుండా యిప్పుడు ఏటిలో దిగకూడదు. తెప్పతో పోతే యిక ఆయన్నేం అందుకుంటావు ? నువ్వుకూడా లాంచీ ఎక్కు. రండి అయ్యగారూ ! రండి రండి అమ్మగారూ !

జానకి : ప్రాణాలకోసం అంత ఆరాటపడ్డ మనిషి చివరకు చచ్చిపోవలసిందేనా ప్రసాద్ ?

ప్రసాద్ : బ్రతకాలని అంత ఆకాంక్షవున్న మనిషికి ప్రతిక్షణమూ యీ ఆటంకాలు రావడం ఏమిటి ? చివరకు తన ఆశ నెరవేరబోతున్న అంతిమ క్షణాల్లో తన అసమర్థతకు తాను బలికావడమేమిటి ?

జానకి : బ్రతుకు మీద ఎంత ఆశను పెంచుకున్నాడు ? పాపం !

ప్రసాద్ : బ్రతుకుమీద అత్యాశను పెంచుకున్నవాడికి చావూ, బ్రతుకూ రెండూ భయాన్ని కలిగించేవే ! ఆశపడడం ఒక్కటే చాలదు జానకీ ! దానికి తగినశక్తి వుండాలి......... సమర్థత వుండాలి—

[హోరున గాలి వీస్తోంది........ జోరున వర్షం పడుతోంది......
ఇంజను చప్పుడు...... లాంచీ బయలుదేరుతున్న శబ్దం........
ఈసంక్షోభంలో దూరంగా...................]

[నరజన్మ మిక దుర్లభమురా......... అన్నపాట వినిపిస్తుంది.]

*[ఆలిండియా రేడియో సౌజన్యంతో]*

కవిత :

## దుఃఖవరణము

— శ్రీ జి. నరసింహారెడ్డి

ఈ దారిద్ర్య భరమ్మున
నిల్లై కుంగిపోయి పోయి
పసిపోయెద నే నేమూ
లనో దినాంతతేజమువలె.

ఓ అంధతమిస్రములా
రా ! రండరుదెండు, మీకు
నిడెద స్వేచ్ఛ నా జీవిత
విహారమున నింకమీద.

కర్కశమగు బాధాపద
ఘట్టనమున తునాతునక
లై చెదరిన జీవితాన
నగుపించునొ కొంత శాంతి.

జడలు విచ్చి ఆంధ్యభూత
ము నటించగ నిర్లిప్తత
నవలోకించెద తాపసి
నై విచిత్రతాకృతినయి.

నన్నున్మత్తునిగా లో
కమ్ము గ్రహింపంగనిమ్ము
దుఃఖశాసకుడనుగా చ
చరించెద దుఃఖస్వామిని.



# నన్నయ కవితారీతి

— శ్రీ బిమరు వేంకటశేషయ్య, B. A.

ఆంధ్ర మహాభారతమునకుఁ బ్రథమ కవి నన్నయభట్టారకుఁడు. ఆయన శ్రీ రాజరాజ నరేంద్రుని 'విద్యా విలాస గోష్ఠి'కి భూషణప్రాయుఁడగు 'కవివరుఁడు'! ఆయాస్థానమునందలి 'మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులగు మహా కవులచే (సకల సుకవిజన) వినుతుఁడు!'

నన్నయ భట్టారకుఁడు ఋషితుల్యుఁడు; ఆయన తన్ను గూర్చి ప్రథమ పురుషములోఁ జెప్పుకొన్న పద్యమునందలి 'మత్యమరాధిపాచార్య — నిత్యసత్య వచను — అవిరళ జప హోమ తత్పరు — సద్వినుతావదాతచరితు' నను విశేషణములే మనోవాక్కాయ కర్మాచరణ సంభృతమైన ఋషిత్వమును జాటుచున్నవి; ఆయన 'నిత్య సత్య వచనుఁ' డగుటచే నీ విషయమున మనము సందేహపడ నక్కఱలేదు; పడఁగూడదు గూడ; 'నా నృషిః కురుతే కావ్య' మ్మను తౌతభట్టు సూక్తి నన్నయ భట్టారకుని విషయమునఁ బ్రత్యక్షర సత్యముగా నన్వయించును. కావుననే 'ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాఽపి' యను కావ్యశాస్త్ర సమయానుసారముగా ఆయన గ్రంథాదియం దాశీర్వాద ప్రక్రియను నిబంధించుచు, 'ఏః... భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరాః శ్రేయసే!' యని మధ్యమ పురుషమునందే స్వగ్రంథ పాఠక (శ్రోతృ) లోకము నుద్దేశించి, వారి శ్రేయస్సు నాకాంక్షించుటలో శాపానుగ్రహ సమర్థమగు ఋషిత్వము తెల్లమగుచున్నది. ఆంధ్ర మహాభారత రచనా నిర్వహణమున నన్నయ భట్టారకుఁడు 'ఋషి' తుల్యుఁ డగుటయు, తిక్కనసోమయాజి (వేదాంతి) 'జ్ఞాని' యగుటయు, ఎఱ్ఱాప్రగడ (నృసింహ) 'భక్తుఁ' డగుటయు, నిజముగా నాంధ్రుల పుణ్య విశేషమేనని చెప్ప నొప్పును. తత్తద్భావకళా విశేషములచే నా యా భాగములలో ఆంధ్ర మహాభారతము సుసంపన్నమై యున్నది గనుక!

ఇట్టి నన్నయభట్టారకుని సంబోధించి, శ్రీ రాజరాజనరేంద్రుఁ డొక్కనాఁడు 'కవి వృషభుల మహాకావ్య' మని సంభావించు 'జననుత కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత' మగు మహాభారతమున నిబద్ధమై నిరూపితమైన యర్థమును 'అధిక ధీయుక్తి మెయిన్ తెనుఁగున రచియింపు' మని యాదేశింపఁగా, మన 'కవివరుఁడు' మొదటఁ గొంచెము జంకియు, 'నీ యనుమతంబున విద్వజ్జనంబుల

యనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెద'నవి యందులకుఁ బూనుకొని, 'ఆదరణీయ సార వివిధార్థ గతిస్ఫురణంబుగల్గి, యష్టాదశ పర్వ నిర్వహణ సంభృతమై పెనుపొంది యుండ, నం దాదిఁ దొడంగి మూఁడు కృతులు (పర్వములు)' మాత్రమే రచింపఁగల్గెను.

సంస్కృతమున మహాభారతము 'సత్యవాక్ప్రబంధ' (ఆది. తృతీ. ఆశ్వా.9) రూపమగు నితిహాసము; మఱియు 'భారత సంహితా రచన' యనుచోట వేద 'సంహితా' రూపమై, దాని 'పంచమ వేద' త్వము తెలియఁబడుచున్నవి. మహాభారతమునకు 'వేదత్వము' సంస్కృతమున నిబద్ధమైనను, తెనుఁగున దానిని 'కావ్యము' గా నిబంధించిన ట్లాయన మాటలలోనే వ్యక్తమైనదిగదా! కావున నాంధ్రభారత విమర్శకు లెల్లరును దానిని 'కావ్య' దృష్టితో విమర్శించి సంభావించుట యభిలషణీయమని యేర్పడుచున్నది.

మఱియు శ్రీ రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టారకుని బలుకరించుచు ప్రభుసమ్మితములగు 'అర్థధర్మశాస్త్రముల తెఱంగెఱింగితి'— (మిత్రసమ్మితములగు) 'విమలమతిం బురాణములు వింటినసేకములు'— (కాంతాసమ్మితములగు) 'నుదాత్తరసాన్విత కావ్యనాటకక్రమములు పెక్కుసూచితి' నని చెప్పిన సందర్భమునుబట్టి, ఆయన మహాభారతమును 'కావ్యము' గా రూపొందించుటచే, 'కావ్యనాటకక్రమములు' 'ఉదాత్తరసాన్వితము' లగునుగావున, 'నానారుచిరార్థసూక్తినిధి' యగు తనకావ్యముగూడ నుదాత్తరసాన్వితముగా నిర్మించినాఁడనియే చెప్పఁదగియున్నది. మఱియు 'మహాకవి' యైనవాఁ డాయన దృష్టిలో 'మృదుమధుర రసభావభాసురనవార్థ వచనరచనావిశారదుఁడు' గదా! కావున నాయన నిర్మించిన మహాభారత కావ్యము 'మృదుమధురరసభావభాసుర' మని చెప్పుట సత్యదూరము కాదు.

కావ్యరచనాప్రవృత్తుఁడగు కవి 'ప్రతిభా-వ్యుత్పత్త్యభ్యాస' వంతుఁడై యుండవలయునని యాలంకారికుల (కావ్యశాస్త్రజ్ఞుల) నియమము! ఆ దృష్టితోఁ జూచినను నన్నయభట్టారకునియందుఁ బయి ప్రతిభాదిత్రయమును సుసంపన్నమై యున్నట్లు 'నిత్యసత్యవచనుఁ'డగు ఆయన పలుకులను బట్టియే తెలియఁగలము! 'సత్ప్రతిభాభియోగ్యు'ననుటచేఁ బ్రతిభయు, నందునను 'సత్ప్రతిభ' యు; 'విపుల శబ్దశాసను - సంహితాభ్యాసు - బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతు - లోకజ్ఞు—' ననుటచే లోకశాస్త్రకావ్యాద్యవేక్షణరూపమగు వ్యుత్పత్తియు, 'ఉభయభాషాకావ్య రచనాభిశోభితు' ననుటచేఁ, గావ్యాభ్యాసమును, ఆయనయందుఁ బుష్కలముగాఁ

బంచి నిండారినట్లు నిరుపద్రవముగాఁ జెప్పవచ్చును। అంతేగాక 'ఆంధ్రావళి మోదముం బొరయ - మహాకవిత్వదీక్షావిధిఁ'—గై కొని కడమ పదునైదుపర్వము లను దెనుఁగించి యాంధ్రావనిలోఁ దనవంటి మహాకవి 'న భూతో న భవిష్యతి' యనిపించుకొన్న తిక్కనసోమయాజి నన్నయభట్టారకునికి 'ఆంధ్రకవిత్వ విశార దుఁడు - విద్యాదయితుండు' అని బిరుదులొసంగినట్లు శ్లాఘించుటయేగాక తత్పద ములలోనే ఆయన ప్రతిభాది త్రయమును గూడ వ్యంగ్యముగాఁ దెల్పినట్లు, 'మహితాత్ముఁడు - ఆంధ్రకవిత్వవిశారదుండు' అను పదములచే నాతని ప్రతిభను, 'విద్యాదయితుండు' అను పదముచే నాతని బహువ్యుత్పత్తిని, 'ఒనర్చె-దక్షతన్' అను పదములచే నాతని రచనాభ్యాసకౌశలమును, వ్యక్తీకరించెను। ఇట్టి నన్నయ భట్టారకుని 'కవితారీతి'ని గూర్చి - అల్పజ్ఞుఁడనైనను - రెండుమాటలు వ్రాయ సాహసించుచున్నందులకు విద్వల్లోకము నన్ను మన్నించునుగాక.

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తి లో
నారసి మేలునా; నితరు లక్షరరమ్యత నాదరింప; నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్."

(ఆం. భా. మొదటి ఆశ్వా.)

అనఁగా శ్రేష్ఠముగా (అత్యుత్తమముగా) మననము (విమర్శనము) చేయఁ గల్గు మనస్సుతోఁ గవీంద్రులైనవారు 'ప్రసన్న కథా కలితార్థయుక్తి'ని దన కావ్యము లోపలఁ బ్రయత్నపూర్వకముగా గుర్తించి గ్రహించి 'మేలు। మే।' లని శ్లాఘించు నట్లును, తదితరులు అందలి 'అక్షర రమ్యత' చే నాకర్షితులయి తన కావ్యమునఁ బ్రవృత్తులగునట్లును, ఇక్కని 'రచన బంధురత' కావ్యశైలీ గుణమయి శోభిల్లు నట్లును, నన్నయభట్టు భారత సంహిత (వేదము)ను జగద్ధితార్థమై తెనుఁగు చేసెనని భావము.

పయి విచారమునుబట్టి నన్నయభట్టారకుఁడు భారతమును 'సంహిత' గాఁ గాని, పురాణముగాఁగాని తెనిఁగింపలేదనియు, కేవలము 'కావ్యము' గానే యాంధ్రీ కరించెననియుఁ దెలియఁగలము. కావుననే కవీంద్రులు తన కావ్యమునందలి 'ప్రసన్న కథా కలితార్థయుక్తి' కిఁ దలలూపి 'మేలు, మే। లనఁగల।' రని తన దృఢ విశ్వాసమును మృదూక్తితో వెలార్చెను। సంస్కృత భారతమే 'సత్యవాక్ప్రబంధ' రూపమైనప్పుడు, ఆంధ్ర భారతముగూడ నిట్టి 'ప్రబంధము' కాకపోవుటకు వీలు లేదుగదా। తిక్కన సోమయాజి 'అమ్మహాకావ్యము (వివిధ ప్రబంధములు గల్గి

నట్టిది) నను సంధానము' చేసినట్లు చెప్పి తన భారత భాగముగూడ 'మహాకావ్య మే' నని పేర్కొన్నప్పుడు, నన్నయభట్టారకుఁడును 'నిక్కావ్యంబు' నని పేర్కొన్నప్పుడు, ఆంధ్ర మహాభారతము 'మహాకావ్య' మనియే నిర్దేశించుట యుక్తము. అందుచే మహాకావ్యమగు భారతము, సంస్కృతమున అధ్యాయ (సర్గ) బంధమే యైనను, తెనుఁగున 'ఆశ్వాసబంధ' రూపమై యొప్పుచున్నది. ఇచ్చట దాని యందలి నన్నయ కవితారీతి విచారణీయము.

'సారమతిం' అను పయి పద్యములో 'కవీంద్రులు' అను పదమునందలి 'యింద్ర' పదము, 'శ్రేష్ఠ' వాచకమేగాక విశిష్టార్థబోధకమై యున్నదని నాభావము. ఇంద్రుఁడు త్రిలోకపాలకుఁడు; అనఁగా త్రైలోక్య విషయవిచార సంపన్నుఁడని స్పష్టము. లోకోత్తర వర్ణనానిపుణులగు కవులలో నింద్రసదృశులు 'కవీంద్రులు;' అనఁగా 'త్రైలోక్యస్యాస్యసర్వస్యనాట్యం (కావ్యం) భావానుకీర్తన'మ్మను భరతాను శాసనమునుబట్టి భారతీయదృష్టిలోఁ గావ్యము త్రైలోక్యభావానుకీర్తన రూపము గదా! అప్పుడు కవి శాస్త్రచక్షువై సందర్శించిన త్రిలోకస్థ విషయములను దన కావ్యమున వర్ణించువాఁడని యేర్పడును; అట్టి 'కవీంద్రులు'— అని పయి పదమున కర్థము! అట్టి కవీంద్రులు 'సారమతి' తోఁ దనకావ్యమునఁ బ్రసన్న కథా కలితార్థ యుక్తిని 'లోనారసి' శ్లాఘింపఁగలరని ఆయన భావము. ఈ దృష్టితో నన్నయ కవితారీతికి రూపుదిద్దునట్టివి— ప్రసన్నకథ, తత్కలితమగు అర్థయుక్తి, అక్షర రమ్యత, రచనాబంధురత— యను నట్టివి. వీనినిగూర్చి సంగ్రహముగాఁ బరామర్శింతును.

## (అ) ప్రసన్నకథ

సాధారణముగా దీనిని మొత్తముగా 'ప్రసన్నకథాకలితార్థయుక్తి' యని గ్రహించుట పరిపాటి. కాని యందు రెండంశములు— ప్రసన్నకథ, అర్థయుక్తి యనునవి— ప్రస్ఫుటముగా గోచరించుచునే, అర్థయుక్తి ప్రసన్నకథాకలితమై యున్నట్లు తెలియుచున్నది. కావున గ్రహణ సౌకర్యార్థము రెండింటిని విడఁదీయుట యుక్తమని భావించి యట్లు చేసితిని. కావ్యరీతికి—గవితారీతికిఁ బ్రసన్న కథ ముఖ్యమని నన్నయభట్టారకుని యభిప్రాయము. 'ఇతివృత్తం హి నాట్యస్య (కావ్యస్య) శరీరం పరికీర్తిత' మ్మని భరతుఁడు! కథ కావ్యశరీరముగనుక, నది ప్రసన్నమై, నిర్మలమై, నిర్దుష్టమై యుండఁదగునని నన్నయభట్టారకుడు.

జగద్ధితార్థమై కావ్యము ప్రవర్తించునప్పుడు, అట్టి విశ్వ శ్రేయస్సునకు భంగము గూర్చునదెల్ల దోషమే యగునుగదా! శ్రేయస్సును గూర్చి వివరించుచు, నది 'ఐహికాముష్మిక శ్రేయఃప్రాప్తి' (ఆది-3 ఆ. 11 ప.) యని నిర్దేశించెను. అట్టి శ్రేయఃప్రాప్తి 'ఇతిహాస వస్తుసముదాయంబై' న (ఆది. 3 ఆ. 11 ప.) కథచేఁ గల్గునని ఆయన భావము. అట్టి కథ 'ప్రసన్నమై' (అనఁగా నిర్దుష్టమై, విశ్వశ్రేయో భంగకారి కానిదై) యుండఁదగునని యుపపన్నమగును. మఱియు నాలంకారిక సంప్రదాయమును బట్టి 'ప్రసన్నకథ' యనినప్పుడు, 'ప్రసాద గుణభరితమైన కథ' యని యర్థము చెప్పవచ్చును గనుక ప్రత్యేక రసోచితములగు నోజోమాధుర్యము లట నట సన్నివేశ సుందరములయి యున్నను, మొత్తముమీఁద సర్వరస స్ఫోరక ప్రసాద గుణసంపన్నమగు కథ యని యేర్పడును అప్పు డా కావ్యము సర్వరస భరితమనియు, నందలి యితివృత్తము తదుచిత సన్నివేశ సంభృతమనియుఁ జెప్పనగును. అట్టి ప్రసన్నకథ యందుఁ గూర్పఁబడినది 'అర్థయుక్తి.' 'తింటే గారెలు తినవలె; వింటే భారతము వినవలె!' నను నానుడికి హేతువగు భారతము నందలి కథా వైచిత్రిని గూర్చి వేఱే చెప్పవలయునా?

## (ఆ) అర్థయుక్తి

ఈ యర్థయుక్తి పయి ప్రసన్న కథలోఁ గలితమై (చేరి) యున్నట్టిదిగనుకనే యది 'లోనారసి' చూడఁదగియున్నట్లు నన్నయభట్టారకుని యభిప్రాయము. అప్పుడే కావ్యానుభూతికల్గి 'మేలు!' అని శ్లాఘింపఁగలరని యాయన భావించినట్లు స్పష్టము. 'అర్థయుక్తి' యనఁగా అర్థములతోడి యోగము; ఇచ్చట నర్థములనఁగాఁ 'గావ్యార్థము' లని గ్రహించుట న్యాయము. వస్తు-నేతృ-రసఫలౌచిత్యాదులు కావ్యార్థములు. అందు వస్తువు ప్రసన్నకథలో నంతర్భూతమైనది; కడమ నేతృ-రసౌచిత్యాదులు- 'అర్థయుక్తి' లో నంతర్భూతమగునని చెప్పఁదగును. ఆనంద వర్ధనుఁడు 'రసాది రర్థః' అని చెప్పి, స్వప్రకరణోచితముగా రసభావ తదాభాసము లను భావించియున్నను, రసాదిక 'మర్థ' రూపమని యాయన వచనముచే గ్రహింప నగుచున్నది. భరతుఁడు 'కావ్యార్థము' లను నిర్దేశించియుండుటవల్ల, నానంద వర్ధనుని రసాద్యర్థములు భరతుని కావ్యార్థములలోఁ జేరునని చెప్పవచ్చును. అనఁగాఁ గావ్యమునకుఁ గావ్యత్వము నొసఁగు నర్థములన్నియుఁ గావ్యార్థములే యగుటవల్ల నవి ప్రసన్నకథలో నంతర్భవించి, కథార్థములగుటలో విప్రతిపత్తి లేదు! కవీంద్రులు ప్రయత్నపూర్వకముగా 'సారమతి' తో 'లోనారసి' చూడఁ

దగినవి ప్రసన్నకథలోఁ దదేకాకారత్వమును పొంది యేర్పఱుపరాకున్న కావ్యార్థములే యని చెప్పక తప్పదుగదా ! అట్టి యర్థయుక్తితోనే గదా తన కావ్యమునకుఁ గావ్యత్వ మబ్బునది ! ఈ యర్థయుక్తి ప్రసన్నకథా కలితమై యుండును గనుకనే నన్నయభట్టారకుఁడు దానిని వేఱుపఱుప నొల్లక, యేకసమాస నిబద్ధము గావించి యున్నాఁడనవచ్చును. శకుంతలోపాఖ్యానాదు లిందులకుఁ జక్కని యుదాహరణము లెన్నియేని నన్నయ భారతమునఁ గలవు.

## (ఇ) అక్షర రమ్యత

'ఇతరు లక్షర రమ్యత నాదరింతు' రని నన్నయభట్టారకుఁడు విశ్వసించుటలోఁ దన కవితారీతి 'కక్షర రమ్యత' యు స్వరూపప్రదానము చేయుచున్నదని చెప్పవచ్చును.

'అక్షరరమ్యత' యనఁగా, నక్షరముల 'రమ్యత-రామణీయకము-సౌందర్యము' అని భావము. ఇచ్చట 'అక్షరము' లనఁగాఁ, కేవల మక్షరములనియే గ్రహించినయెడల, 'సముచితవర్ణవిన్యాససౌందర్య' మాపాతమధురమై యాహ్లాదకారియగుట యతని కవితారీతియని యేర్పడును. నన్నయభట్టారకుని కవితయందీ లక్షణము పుష్కలముగానున్నట్టు లాంధ్రభారత పాఠకులకుఁ దెలియనిదికాదు ! 'అక్షరరమ్యత' యందలి 'అక్షర'పదమును 'పద-పాద-వాక్య-వాక్యాంశములకుఁ' గూడ నుపలక్షణముగా గ్రహించినయెడల, నా యక్షరసౌందర్య పరిధి విస్తృతమయి, నన్నయకవితారీతికిఁ జక్కని రేఖ దిద్దినట్లుగూడఁ గాఁగలదు ! 'అక్షర' రమ్యతను వర్ణవిన్యాసదృష్టితోఁ జెప్పినయెడల, ననుప్రాస-యమకాది శబ్దాలంకారజాతమందు గతార్థము కాఁగలదు; పద-వాక్యాదులను గూడఁ జేర్చి గ్రహించిన యెడల, సమాస-వాక్య-వాక్యాంశ వినివేశన సౌందర్యము గోచరించుటయేగాక, పుష్పావకీర్ణరీతితోనుండు వాచక లక్షక వ్యంజక పదరమ్యత, ఆలంకారికు లంగీకరించిన వృత్తి పాకరమ్యత, గూడఁ బ్రకాశితమై హృదయావర్జకము గాఁగలదని చెప్పవచ్చును.

నన్నయభట్టారకుని సమాసరచన యసమానసౌందర్యధుర్యమని విమర్శకులెల్లరు నంగీకరించినట్టిదే ! అక్షరరమ్యతయందే చేరఁదగిన వృత్తౌచిత్యమునఁ గూడ నాయన సిద్ధహస్తుఁడే ! ఉదాహరణార్థము— ఆయన సీసములను నడపు విధానమునఁగల 'అక్షరరమ్యత'ను బరిశీలింతము, ఎంత రమ్యముగానుండునో !

1. సాధారణముగాఁ గథాకథనవేగానుకూలమగు ధారాశుద్ధితో నొప్పుచు శ్రవణతాడితమైనంతనే మనోమోదముగల్గించుట ఆయన సీసములకుఁగల ప్రధాన ప్రత్యేక లక్షణము. ఇట్లు—

సీ. "అంత దేవాహితు లమృతంబుగానక
యెంతయు నలిగి బలీంద్రుఁగూడి
మంతనంబాడి యమర్త్యులతోడి
పొత్తింతియుఁచాలు నింకేలయనుచు
నంతనకట్టి"—ఇట్లే పరుగులిడుచుండును ;

2. తర్వాతి కవులకు భిక్షపెట్టినాఁడాయన్నట్లు ఏపాదమున కాపాదమును విడఁగొట్టి యొకవిధమగు (Relief) విరామమొసఁగి, యాహ్లాదముకల్గించును; ఇట్లు

సీ. "కమనీయ ధర్మార్థ కామమోక్షములకు
నత్యంతసాధనం బయినదాని
వేడ్కతోఁ దనివి తీఱ వినుచున్నవారల
కభిమత శుభకరం బయినదాని
రాజుల కఖిల భూరాజ్యాభివృద్ధి
నిత్యాభ్యుదయ ప్రదం బయినదాని
వాఙ్మనఃకాయ ప్రవర్తితానేక
జన్మాఘ నిబర్హణం బయినదాని—(ఆది. 3 ఆ. 9.)"

3. మొదటి మూఁడుపాదముల నొకవిధముగా విఱిచివ్రాసి, నాల్గవపాదమును గథావేగములోఁ గలుపుకొని నడపించి యింపుపుట్టించును ; ఇట్లు—

సీ. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణ
సముచ్చయంబని మహిఁ గొనియాడుచుండ—"

ఇట్టి ప్రక్రియతో సాగిపోవుచుండును ;

4. యతి-ప్రాసయతి నియమబద్ధమై శ్రుతిరమ్యతను సంతరించుకొనిపోవు సీసపద్యములకు మహాభారతము పుట్టినిల్లనఁదగును, విస్తరభీతిచే నుదాహరణము లీఁజాలనైతిని.

ఇట్టి పరిశీలనతో నక్షరరమ్యత యను నాతని కవితారీతి యక్షరమై విరాజిల్లు ననవచ్చును।

## (ఈ) రచనాబంధురత

నన్నయభట్టారకుని వర్ణపదాది విన్యాసపుఁ జక్కఁదనము తర్వాత దాని చిక్కఁదనము కొఱకు 'రచనాబంధురత' తత్కవితారీతిగాఁ బరిగణింపఁ దగియున్నది. కాని 'తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁ డయ్యె' ననునది 'నన్నయభట్టు' నకు విశేషణమే యైనను, దాని నట్లే గ్రహించినందువల్లఁ గల్గు సారస్యముకంటె, దానినుండి యాయన యీ శైలీలక్షణమును సంపాదించుటచేఁ గల్గునట్టిదే యెక్కువ యని నా విధేయ విజ్ఞాపనము। ఒకవిధముగా నాంధ్ర భాషలో నాదికావ్యమగు మహాభారతమున నన్నయభట్టు 'రచనా బంధురత' యను కవితారీతిని వ్యంగ్యముగానైనను బ్రతిపాదించినట్లు సాధింపఁబడినయెడల, నది తదితర కవులకు భిక్షాప్రదానము చేసినట్లేకాదా? వెనుకటి 'అక్షర రమ్యత' క్రిందఁ జెప్పఁబడిన వర్ణపదాది విన్యాసరమ్యత రసౌచిత్యాది సాహిత్యదృష్టితో సంభావింపఁ బడినట్టిది. ఈ 'రచనాబంధురత' భాషావృష్టి నాశ్రయించి సాధింపఁదగినట్టిదియని ద్వివిధముగా వివేచింపవచ్చును గూడ। రమ్యతాభావ మక్కడ; బంధురతాభావ మిక్కడ। ఈ రెండింటికిని 'సారమతి' తోఁ జూడఁగలవారికి భేదము పొడగట్టక పోవదు। 'మహాభారత సంహిత' ను 'తెనుంగునన్ రచనాబంధురుఁడయ్యె।' నన్నప్పుడు, 'బంధురత' గల రచనారీతిలోఁ దెనుఁగున వ్రాసెనని సాధించుటయు నసాంప్రదాయికము కాఁబోదు।

నాభావమున 'విశిష్టమగు పదరచన' గల వైదర్భ్యాదిరీతియుఁ, 'బరివృత్త్యసహిష్ణు' పదరచనారూపమగు 'శయ్య' యు సహజముగా నీ 'రచనా బంధురత' లోఁ జేర్పఁబడఁ దగియున్నవి. అట్లే లుగలుక్సమాసరచనయు, మసృణతా మధురమైన సంధిబంధ సందర్భమునుగూడ నీ కవితారీతియందే చేరుననవచ్చును. అంతేగాక పద్యరచనార్థమై గ్రహింపఁబడిన ప్రక్రియను గద్యరచనయందును బాటించి దాని స్వరూపము నున్నతపఱిచి యిచ్చుటయందును నన్నయభట్టారకుఁడు 'రచనాబంధురత' ను బాటించి యున్నాఁ డనుట సత్యదూరముగాదు గదా। పైనఁ

జెప్పఁబడినరీతి శయ్యాది 'రచనాబంధురత' ప్రక్రియలకు నన్నయ భారతభాగ మంతయు నుదాహరణప్రాయమే యనవచ్చును. ఆయన యొరవడిపెట్టిన యీ 'రచనాబంధురత' నే తర్వాతి కవులలోఁ గొందఱు 'తు-చ' తప్పకుండ ననుసరించియుఁ, గొందఱు స్వోపజ్ఞమైన యలఁతి మార్పులు ప్రవేశపెట్టుకొని నిర్వహించియుఁ దదనుయాయిత్వమును బ్రదర్శించియున్నారు. ఈ 'రచనాబంధురత' యే రసౌచిత్యాది సాహిత్యిక ప్రయోజనవంతముగా నిర్వహింపఁబడుచో, 'అక్షర రమ్యత' క్రిందికిఁ జేరును; అట్లుగాక సాధారణముగాఁ గథానిర్వాహకదృష్టితోఁ బోషింపఁబడుచో, స్వస్వరూపముతో నిర్దేశింపఁబడును।

ఇట్లు విభాగదృష్టితో నన్నయభట్టారకుని కావ్యమున గోచరించు 'కవితారీతులు' నాల్గు—ప్రసన్నకథ; తత్కలితమైన యర్థయుక్తి; అక్షరరమ్యత; రచనాబంధురత యని- కాని యివి యన్నియుఁ గలిసియే యఖండాకారమై కావ్యరూపమును ధరించి, సహృదయులకు రసానంద విజ్ఞానానందప్రద మగుచున్నవని చెప్పవచ్చును.



గ్రంథ స్వీకారము :

| | | |
|---|---|---|
| ౧. స్మృతి మందిర్ | .... | డా. పోతరాజు రామమూర్తి |
| ౨. అహల్యాస్తవము | .... | శ్రీ పురాణపండ రామమూర్తి |
| ౩. శ్రీ శివస్తోత్రములు | .... | శ్రీ పురాణపండ రామమూర్తి |
| ౪. తిక్కన | .... | శ్రీ వేముగంటి నరసింహాచార్యులు |
| ౫. విశ్వనాథరాయడు | .... | శ్రీ సి. నారాయణరెడ్డి |
| ౬. అణువులు | .... | శ్రీ కే. ఏ. ఎల్. |
| ౭. మేల్కొన్న ఆకాశం | ... | శ్రీ మాదిరాజు రంగారావు |
| ౮. ప్రమాణపద్ధతిపై ప్రసంగము | | అనువాదకులు : |
| రెనెడెకార్ట్ ప్రణీతము | .... | డాక్టర్ కే. సచ్చిదానందమూర్తి |
| | ... | డాక్టర్ కే. వి. ఆర్. నరసింహము |
| ౯. శ్రీ సత్యానందాశ్రమ | | |
| రజతోత్సవ పంచిక | ... | శ్రీ సత్యానందాశ్రమము, |
| | | ఇనుమడుగు, నెల్లూరుజిల్లా |

స్కెచ్ :

# ఎఱ్ఱని పువ్వు

— శ్రీ గూడూరి సీతారాం

కాలేజీ ఆవరణలోనే తిరుగుతున్నాను. చాలామంది మిత్రులు చేతులు కలుపుతూ వెళ్లిపోతున్నారు, అందరూ వెళ్లిపోతున్నారు. నా కాళ్లూ కదలుతూనే ఉన్నాయి. ఎందాకా కదలుతున్నాయో, గమ్యస్థాన మేదో, సోపానమేదో తెలియదు. కళ్లకూ - కాళ్లకూ ఇవేవీ అక్కర్లేనట్లున్నాయి. పోతూనే ఉన్నాయి. గాజుల గలగల చప్పుళ్లూ, బూట్ల టకటక ధ్వనులూ ఏవీ వినిపించడంలేదు.

ఆగిపోయినాను. అందాకా తెలియదు, ఎందాకా వొచ్చినానో. ఏమీలేదు, ఓ చిన్న తీగె ముందు కాలాగింది. చుట్టూ చూసినాను. అంతా పచ్చగా ఉంది. కాని ముఖం దగ్గరగా ఎఱ్ఱని పువ్వు ఉంది. అప్పు డర్థమైంది నా నడక గమ్యస్థానం. ఏవో రహస్యాలను శోధించే చూపులు శూన్యంలోకి తీసుకెళ్లతాయా అనుకొన్న నా నమ్మకం నమ్మకంగానే ఉంది.

పువ్వు చాలా బాగుంది. ఎఱ్ఱగా ఉంది. ఆ రంగు హృదయాన్ని ఎందుకో అలా పట్టుకొంది చిన్నపిల్ల డాక్టర్ వద్ద కెళ్లమంటే తల్లిని పట్టుకొన్నట్టు, ఆరంగు నన్ను గట్టిగా పట్టుకుంది. ఎందుకా అని ఆలోచించ బుద్ధివెయ్యలేదు. కాని మనసుకి తెలుసు, ఆ ఎఱ్ఱ రంగంటే నాకు చాలా యిష్టమని. అల్లాంటి ఎఱ్ఱరంగే మా అమ్మా నా చిన్ననాడు ఊరికే ఉపయోగిస్తుండేది. అదన్నమాట ఆ రంగుకూ-నాకూ గల సంబంధం.

పిచ్చివాళ్లు, వాళ్లకేం తెలుసు ఆరంగు నాకు ప్రాణప్రదమని? వాళ్ల కెట్లా తెలియజెప్పను? చెప్పినా, ఈ తామరాకు మీది నీటిబొట్టులాంటి వీళ్ల కెట్లా అర్థమౌతుంది? అందుకే క్లాసులో నిన్న అంత అల్లరిజరిగింది. ఆమెను ఎన్నో రోజుల నుండి చూస్తున్నాను. అట్లా ఎంతమందిని చూడ్డంలేదు— పలుకరించడం లేదు— కలసి నవ్వడంలేదు? పోతే ఆమెను ఊరికే చూచినాను; పాఠం గలగలా వినిపిస్తున్నా గాని. ఆఖరికి ఆ పాఠంచెప్పే పెద్దమనిషి కూడా అనుమానపడడమా? ఆమె ఆనాడు ఆ ఎఱ్ఱని బ్లౌజు ఎందుకు వేసుకొచ్చిందా? అనిపించింది. అది ఆమె తప్పా? నాకు నచ్చిన ఎఱ్ఱరంగు బ్లవుజును చూడ్డం నాది తప్పా? ఎవరి తప్పో ఎవరు నిర్ణయిస్తారు? ఈ పిచ్చివాళ్లు! నా ప్రియమైనదాన్ని నేను చూస్తుంటే 'ఆమెను చూస్తున్నావ్, ఎందుకు చూస్తున్నావ్? పాఠం వినూ' అంటారు. నేను

ఆమెను చూడ్డం లేదంటే నమ్ముతారా ? పైగా యిదో బుకాయింపా ? అంటారు. అంతా గొడవ జరిగింది.

విన్నటిదంతా గాలికి ఒయ్యారంగా కదలుతున్న ఎఱ్ఱనిపువ్వు చిరునవ్వుతో జ్ఞాపకంచేసింది. ఏం చేస్తే ఏం ?

నా కా పువ్వును తెంపుకోవా లనిపించింది. ఆ ఎఱ్ఱనిది ఏదో ఆ లోకాలకి తీసుకెళ్లుతుం దనిపించింది. లేకుంటే అంత దూరాన్నుంచి- అంత రణగొణ ధ్వనుల్లో నుండి నన్ను నా కాళ్లూ - కళ్లూ రెక్కబట్టి లాక్కొస్తాయా ? అంత పిచ్చియా ? నేనూ ఎంత నిస్వార్థపరుణ్ణనుకొన్నా నా కళ్లకూ - కాళ్లకూ ఇంకా ఏ మూలలోన్నో స్వార్థం దాగునేఉంది.

అప్రయత్నంగా చేయి జాపినాను. కదలుతున్న పువ్వు నా చేతికి తాకి దూరంగా పోయింది. అందుకోవాలనే ఆకాంక్ష చేయిని ముందుకు జాచింది. వికాసంగా విలాసంగా తలూపుతున్న ఎఱ్ఱని పువ్వు దగ్గరగా ఒదిగింది. ఏదో జాలో, మరి బాధో కదలినట్టనిపించింది. ఇంకా చేయిని ముందుకు పోనియ్యలేదు. అలాగే నిలుచున్నాను. ఏవో కోర్కెలు గుబాళించినాయి. వెంటనే చేయి వొస్తుం దనుకున్నాను, కాని కొమ్మనే వంచింది. దూరంగా ఒదిగిన పువ్వు దగ్గరగా వొచ్చింది. సిగ్గుతో- తలవంచుకున్నట్టుగా ఉంది పూవును కోయడానికి ధైర్యం చాలలేదు. కాని కనీసం ఒక్కసారైనా తాకాలనే కాంక్ష కలిగింది. ఇంతలో పూవు కిలకిలమంటూ దూరంగా పోయింది. ఇక అక్క డొక నిముషం నిలుచోబుద్ధి కాలేదు. చేయి జేబులోకి పోయింది. దేనికోసమో తడిమింది అందన ట్టుంది. కాళ్లు కుప్పలాగా కూలిపోతున్నట్టుగా తోచింది. ఏమీ పాలుపోలేదు. దూరాన్నుండి పచ్చని చీరె కట్టుకొని, ఎఱ్ఱని జాకెట్టు వేసుకొన్న అమ్మలా నిలుచొని దగ్గరగా రా ! అని చేయెత్తి పిలిచింది పచ్చని గడ్డి. వెంటనే వెళ్లి ఒళ్లో వాలిపోయినాను. 'బాధపడుతున్నావా బాబూ !' అని తల నిమిరి ఓదార్చింది అమ్మ. కళ్ల నుండి నీరు కారుతున్నది. అమ్మ తన పచ్చని చీరెతో కళ్ల నద్దింది.

దూరాన్నుండి కిలకిల నవ్వుతూ, తలపంకిస్తుంది ఎఱ్ఱని పువ్వు.

'నే నున్నానుగా బాబూ !' అంటూ దగ్గరగా, యింకా దగ్గరగా, తనలో కలిపేసుకుందామా అన్నంత దగ్గరగా తీసుకొని తన హృదయాని కద్దుకుంది అమ్మ.

అమ్మ ఒళ్లో అంతా మరచిపోయి, గాలిలో వెక్కిరిస్తున్నా అని ఎగిరిపడే పువ్వుతో నేనూ నిండుగా నవ్వుతూ - వెక్కిరిస్తున్నా !

ఆకాశంలోని మబ్బులు మమ్మల్ని జూసి నవ్వుతూ వెళ్లిపోతున్నాయి. ★

# మంథర

— శ్రీ దుర్గానంద్

మంథర, రామాయణానికి గృహచ్ఛిద్రం. చరిత్రకు బుద్ధిక్రీడ. మంథర వ్యక్తి. వ్యక్తిలో వర్తమానం ఉంది. వర్తమానానికి వ్యక్తి విలువల్ని నిర్ణయించే శక్తి లేదు. చరిత్ర కుంది. మంథర చేసినపని మంచిది చరిత్రకు. మంథర పని మంచిదికాబట్టి మంథర మంచిది. మంథర మంచిది కాబట్టి మంథర కానివాళ్ళు చెడ్డవాళ్ళు.ఇది నా పాత్రలకు కావలసిన సులభోపాయం. ఈ ఉపాయంప్రకారం మంచి చెడులు అపద్ధర్మాలూ, ఆపదర్థాలూ. అంటే వ్యక్తి విలువతో గుణం తేల్చక గుణంతో వ్యక్తిని తేల్చిన నిర్ణయాలు. రామునికంటె రావణుడు మంచివాడు అన్న పద్ధతిగల న్యాయశాస్త్రంతో నేను మంథరను నిర్ణయించడంలేదు. రాముణ్ణి మంచివాడని ఏ న్యాయశాస్త్రంతో అన్నామో ఆ న్యాయశాస్త్రంతోనే చెడ్డవాడు అనగూడదు. న్యాయశాస్త్రం కూడా మారాలి. మంథర విషయంలో మారింది. నా అభీష్టం ఒక్క మంథరను గూర్చి చెప్పడమే. అయినా ఈ తీగెతో పాటు అయోధ్య డొంక కూడా కదులుతుంది. ఈ కదలికలో ఎన్నో పాత్రలు తారుమారైనాయి. ఇది ఈ కవిత్వంలో పెద్ద అసౌకర్యం.

అదిగో వీచెను హోరుగాలి యినవంశాంభోధిలో నావలై
ప్రిదిలెన్ రాచసిరుల్, తపఃప్రసవముల్ ఫేనోర్మికారేఖలై
చిదిసెన్, బుస్సున పొంగి త్రెళ్ళెడు సుడుల్ చీల్చెన్ వరాకప్రథన్,
ముదిమోముల్ తెరచాపలై యొరిగె సమ్మోదస్థలుల్ దూరముల్.

గుండుకొని పోవుచుండె విఘూర్ణితమ్ము
లై ప్రళయసైకతములు సనాదికథలు
మనువు చెప్పిననీతులు, మనుజనాథు
కుండవలసిన హక్కులు, కుమిలియౌడు
గఱచుచున్నవా మంథర కఱకు భ్రుకుటి
మోల, మబ్బులు వాత్యల మ్రోలవోలె

సామదాన భేదాదిక చతురుపాయ
జరలు, ప్రభుమంత్రణోత్సాహ శక్తు లంతి
పురపు టచ్చు కట్టకు లలవోక లలతి
పాదచాలనము లతీతభాగ్యభుక్త
పాండుర యశఃప్రలాపానుపాలితాత్మ
హీన చారణ గళ గళ ద్గానరుతులు
కులపు పెద్దల కిడెకు మ్రొక్కుడులు, బలులు
కటకటం బడుచుండె మంథర కంటిముందు.

వ్యూహకుశలురు, వ్యగ్ర సంస్ఫోట జీవు,
లతిమదోత్కట బృంహితాహ్వానరతులు,
బిరుదు గస్తీలు, నుక్కుటోపీలు, పిడులు,
ఓటువడుచుండె మంథర కాటు ముందు.

పుట్టుబానిస మంథర, పుట్టుగూని,
దశరథేశుని యింట వార్ధక్యదాసి,
అతిగపోయిన మంచికి యతియుప్రాస,
తీపి వెగటున కొంక పులితేన్పు పిసరు.

దాసీ మంథర ! నీ యలభ్యధిషణాదార్ఢ్యమ్ము నగ్గింతు, లో
కాల్ నీ యన్నవికాని నీ యలఘుకైంకర్యోద్భవక్రాంతి చే
ష్టాసంరంభము కాననేర్చెనె ! త్వదిచ్ఛాపూర్తిలోనే సమ
స్యాసారస్యములున్నవో మెటిగెనా యాతానుయాయుల్ ప్రజల్.

కులమా హీనము, రూపమా తఱుగు నిగ్గుల్ మాపు దాస్యమ్ములఁ
నిలకోర్దై కుసిలించినావు బ్రతుకింతే చేదునై చప్పగా
గళముఁ మ్రింగుడుగామి నీ వుమియ నాకాక్షించినావే చెలీ !
తులదూగఁ సరిరారు నీకు కృతినీ ! దుఃఖాత్మ నాధీరువుల్.

ఒక మహాశిల్పి చేబూని యులిని కూరు
చుండునా మిన్నకయె శిలాఖండమెదుట
దాది! నినుబోలు రాజ్యతంత్రజ్ఞురాలు
భేదపుంబట్లు రా జాలవిడచు నెట్లు?

రమ్యసాకేతపురము నీ రాచనీతి
కయ్యె జదరంగఫలకము హ్రస్వదేహి!
ఒరుల మనసుల దౌర్బల్య మొక్క టొకటి
బంటులుగ జేసికొన్నావు ప్రాజ్ఞురాల!

ఈతడు దశరథు డిక్ష్వాకు కులదీప్తి
కాని పెదతనాన కైకపిచ్చి
ఆతడు కులగురు డధికవిద్యాశాలి
కాని తీర్పుల శాంతికలన హెచ్చు
పుడమికే బంగారు పూర్ణచంద్రుడు రాము
డవుగాక జవదాట డార్యులాజ్ఞ
మేటిదిటవరి సౌమిత్రి నిక్కమెగాని
గడ్డిపోచన అన్న గట్టు వాని
ఇట్టి యనుదర్క దైన్యాల కిక్క వారు
'మంచి' యను మాయకోట రక్షించు భటులు
శుష్క ధర్మపు నిగళాల జుట్టువడిరి
తెగువ సేయవె మంథరా! త్రెంచి తెరల.

ఈ మెఱమెచ్చు ధర్మముల కేమిటె యీ నయనీతిశాస్త్రపుం
జామనచాయ వన్నియ పిసాళుల కేమిటె వృద్ధదాసి! యీ
నేమములన్నియుఁ సుఖపునేలల బుట్టు పసిండిపూలు, నీ
వామనహస్తమెత్తి తెగవ్రయ్య లొనర్చుము రాచజాడ్యముల్.

అది పాషాణయుగమ్ముదాటి ప్రథనవ్యాసంగసంస్కార సం
పదలన్ గూర్చినకాల మస్త్ర పరశుప్రక్ష్వేడనాద్యాయుధ
ప్రద సంకీర్ణగతిన్ గమించు సమయంబందున్న ప్రత్యర్థిమేన్
బ్రిదలన్ గాయము జేయుచే గెలుపు తాపేలేదు ధీశక్తికిన్.

బాహుబలమ్ములోనొ, ఖరబాణము తొడ్గుటలోనొ, మేఖలా
వ్యూహముపన్ని శత్రుల నయోద్ధుల జేయుటలోనొ, ఆ యుగ
ప్లీహము దాగియున్నది ప్రవృద్ధశరీరము, బల్మి, రక్తపుం
దాహములా జగాన ఘహుధా బహుమూల్య ధనంబులయ్యెపో.

పణములు నస్త్రవిద్యలకె, పందెములొడ్డుట ఖడ్గ పాండితీ
గణనకె, ప్రేమబంధనపు కాన్కలుగా గజయూథమిచ్చుటల్,
రణవిజయంబు నేకొనిన రాణువయే యనుపాలియౌట, దూ
షణమని యన్న నా పిఱికిచావునె యెన్నుట, సర్వమందుకే.

వైరు లనార్యులౌట తమ వర్గబలమ్ము సమీకరింప నే
వో రచియించి రార్యులు ప్రబుద్ధ మనస్థితి ఘోరవర్ణపుం
గారిక లాశ్రమ క్రమవికారము లా విషమక్రియ న్నిజా
కార మనఃప్రకారముల కల్మష మంటగనీక జూచిరో.

తమ ప్రాబల్యము పోక నడ్డుపడ సంస్థాపించినా రుక్కు దు
ర్గమ కుడ్యంబుల నాధిభౌతికముగా, గై నేసినా రట్టులే
తమరక్తమ్ములు శుద్ధమై మెఱయ సద్ధర్మ ప్రసంగ ప్రలా
పము వల్లించి యహర్నిశల్ పరిషవింపంజేయ నార్యత్వమున్.

ఈ యా కట్టడు లట్టివే బిరుదులై యిక్ష్వాకు కాలాన దీ
ర్ఘాయాసశ్రమ పున్నెమోయనగ పూర్ణత్వస్థితిన్ బొందె, దు
ర్జేయంబైన యయోధ్య తాము రువు గూర్చె న్నాటి యార్యత్వపుం
బోయీ పల్లకిగా రఘూద్వహుని యొప్పుం గీము మేల్పంతిగా!

ప్రాతకాలపు టా రాచనీతి కా యో
యోధ్య తేటు ప్రతిధ్వనియో వశిష్ఠు
డల్లె ధర్మమునకు నిల్వుటద్దమేమొ
రాముడా రెంటి కద్వైత రచన యేమొ.

బధిర పంగ్వంధ యుగముల బారిబడిన
భూతకాలము ప్రసవించె మూకవర్త
మాన మనగ రాము డప్రతిమాన సంగ్ర
హాత్మ బుద్ధి కతనమె కొండాడబడియె.

తమ వ్యక్తిత్వము తగ్గుజేసి యుగవార్ధక్యమ్ము వెంటన్ బ్రయా
ణము గావించు నశక్తులే ప్రజలకంతానన్ బ్రవేశింతు ర
ద్దమరేయి న్నిదురించు మానవుల తంద్రాడోలకున్ జోలయో
సమమౌ రాగమొ, తానమో చెలియగున్ చైతన్యరేఖల్ వృథల్.

అయినను మంథరా ! నిబిడ మానడిరేయి తమస్సులో నుష
స్సయినను విచ్చి పూయ బెఱుచన్ వెలుగొందెడి వేళ నీవు కే
కయ నృప పుత్రికా హృదయ ఘంటికవై నినదించినావు. కీ
డయి యది నీకు జుట్టుకొనె నక్కట ! వ్యర్థ మకాలసత్వముల్.

ఏదెట్లున్నను నీ యపూర్వ యతనం బిట్లే యకస్మాత్తుగా
ప్రాదుర్భావము జెందినట్టిది యనన్రా దిట్టి సంరంభ మం
దేదో చెప్పగరాని కారణ మొకం డేపెక్కి మెల్మెల్లగా
నీదౌ దౌష్ట్యముపేర బాహిరమయెన్ నిస్తేజులై రందఱున్.

(సశేషము)



పుస్తక పరిచయము :

# కర్ణచరిత

రచయిత :
మరుపూరు కోదండరామిరెడ్డి

ప్రచురణ :
మందాకినీ హంసమాల ;
నెల్లూరు

వెల. 3-50

స్వామిభక్తి, కార్యదీక్షాపరత, దాతృత్వము—వినయవిధేయ గుణసంపన్నుడైన కర్ణునిచరితమును మహాభారతానుసారముగ కోదండరామిరెడ్డిగారు చిత్రించిరి. మహాభారతగాథను పునరుక్తమొనర్చుటలో విశేషమేమియని కొందఱికనుమానము గలుగవచ్చును. కాని మహాభారతమును పఠించునపుడు కర్ణునిదివ్యమూర్తి ఆయా సందర్భములందు క్షణకాలము మాత్రమే ప్రకాశించుచుండును. దీనికి కర్ణుని చరితమునందలి లోపము కారణముకాదు. మహాభారతము సముద్రమువంటిది. అందలి కథను చదివినంతసేపు మనదృష్టి కౌరవపాండవులవైపు మొగ్గుచూపుచుండును. కౌరవుల దుష్ప్రవర్తన - ద్రౌపదిపరాభవము - ధర్మరాజుజూదము - పాండవుల వనవాసము - అజ్ఞాతవాసము - సంధిరాయబారములు - కురుక్షేత్రయుద్ధము, శ్రీకృష్ణుని రాజనీతి - లీలలు— ఈ యంశములన్నియు మనదృష్టిని విశేషముగ నాకర్షించుచుండును. ఇక అవాంతరకథలసంగతి వేఱు. అగాథము - గభీరమైన భారతసముద్రమున కర్ణుని దివ్యజ్యోతిని దర్శించు భాగ్య మపుడపుడుమాత్రమే కలుగును. అందువలన కర్ణుని చరిత్రమును ప్రత్యేకముగ చదివినచో నాతని దివ్య స్వరూపము గోచరమగును. ఈ విధముగ జూచిన కోదండరామిరెడ్డిగారి కర్ణచరితము చర్వితచరణము గాదని స్పష్టమగును.

మఱియొక విషయము—ఒకవ్యక్తి జీవితచరిత్రను వ్రాయునపుడు రచయిత చాల జాగ్రత్తగ నుండవలసి వచ్చును. మహాభారతమునందలి వ్యక్తి దివ్యచరితమును వ్రాయునపుడు రచయిత బాధ్యత గురుతరమైనది. వ్యక్తిగతాభిమానమునకు, వ్యక్తిగతాభిప్రాయములకు ప్రాధాన్యము నొసగక గ్రంథకర్త జాగ్రత్త పడవలసివచ్చును. ఏమాత్రము చేయిజారినను కథానాయకుని చరితమున కొంత కళంకమేర్పడవచ్చును. శ్రీ కోదండరామరెడ్డిగారు గ్రంథకర్తగ తమగురుతరమైన బాధ్యతను గుర్తించి కర్ణుని చరితమున కేలోపము రాకుండ శ్రద్ధవహించిరి. ఈ విషయమున వీరికృషి ప్రశంసనీయముగనున్నది. తమకు కర్ణునియెడ నెంత యభిమానమున్నను, మహాభారత కథకు భంగము రాకుండ కోదండరామరెడ్డిగారు రాధేయుని వ్యక్తిత్వమును రమణీయముగ చిత్రించిరి.

కర్ణుని చరిత్ర మొత్తము ఇరువదియేడు పర్వములందు వివరింపబడినది. ఆతని జీవితము నందలి ముఖ్యఘట్టములను వివరించుచు నొక్కొక పర్వమునకు నామకరణ మొనర్చిరి. ఆవాహనము - కలహబీజావాపము - అంగరాజ్యాభిషేకము దౌత్యభంగము—మున్నగునవి. విషయమును సూచించుటకు, కర్ణుని వ్యక్తిత్వమును జూపుటకీ విభాగము మకుటాయమానముగ నున్నది. వీనియందు 19 వ పర్వము వ్యామోహ తరంగిణీ తరణము—యిరువదియేడవ పర్వము 'అపూర్వజ్యోతి ఆరిపోయినది' అను రెండు పర్వములు హృదయమును ద్రవింపజేయు ఘట్టములు. 'సారం పర్వణిపర్వణి' యని భారతమునకు శక్తివచ్చినది. అటులే ఈ చరిత్రము నందలి పర్వములు సారవంతముగ నున్నవి.

"అది భాగీరథీ సరిత్తటము - పైటివేళ దాటినది." ఈ వాక్యములతో 'వ్యామోహతరంగణీతరణము' ప్రారంభమగును - కృష్ణరాయబారానంతరము - కర్ణుడు భాగీరథీ తీరమున సూర్యోపాసన మొనర్చునపుడు - కుంతి యాతని సందర్శించి పాండవాగ్రజుడనియు, పాండవుల జేరుట యుచితమనియు బోధించిన ఘట్టము. తల్లి ఆవేదన - కర్ణునిహృదయమున చెలరేగిన తుపాను - ఆతని స్వామిభక్తి - పంచపాండవులయెడ నాతని దృక్పథము - గురుభక్తి మున్నగు గుణ పుంజముల కీ ఘట్టము పుట్టినిల్లు. 'అపూర్వజ్యోతి ఆరిపోయినది' అను పర్వములోను గ్రంథకర్తగారు కర్ణుని దివ్యజ్యోతిని దర్శింపజేసియున్నారు.

ద్రౌపదీ పరాభవఘట్టము - క్రూరులగు దుర్యోధనాదుల సహవాసము - ఈ రెండు మాత్రమే కర్ణుని వ్యక్తిత్వమునకు కళంకప్రాయములుగ నున్నవి. తక్కిన వన్నియు నాతని యపూర్వతేజస్సంపన్నములు.

మనసుకు నచ్చిన మాండలికములు. ముచ్చనైన మాటలపొందిక - రసానుగుణమైన శైలి - తరంగడోలికలవలె నూయలలూపు సమాసరచన - వంకలులేని వ్యావహారిక పదప్రయోగము - కర్ణచరితమునకు భూషణప్రాయములై యున్నవి. "కర్ణుని తనుత్రాణము పసుపువెన్నెల పఱచిపెట్టినది" "నాజన్మరహస్యమును దాచకున్నచో ధర్మరాజు ఉచ్చులు ద్రెంచుకొనిన లేగదూడవలె చెంగలించి పరుగెత్తివచ్చి నన్ను నిర్వీర్యుని జేయగలడు"—వంటి వాక్యరచన గ్రంథకర్త పరశము - రసవంతమైన శైలికి నిదర్శనము. మూలానుసారములైన "కుపిత పర్జన్య పరిముక్త దంభోళిపెళపెళార్భటీ కల్పనము జననీదత్తవాక్యబద్ధమహామత్తేభము" మున్నగు సమాసములు రచనయందు చక్కగ కుదుర్కొనినవి. పానకములో పుడకలవలె నచ్చటచ్చట "చూవఱుల" — "నీలోత్మలదేహ" వంటి ముద్రణదోషములు గలవు.

కర్ణుని జీవితఘట్టములు - అతని వ్యక్తిత్వమును సూక్ష్మముగ సూచించుచు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు వ్రాసిన "పరిచయము" మహాభారతమున కాలక్రమమున వచ్చిన మార్పులు, పరస్పరవిరుద్ధాంశములు - వివరింపబడిన "ఆముఖము" రామరెడ్డిగారి గ్రంథమునకు బంగారమునకు తావి యిచ్చినటులున్నవి. రెడ్డిగారు చిలికించిన బాసని పన్నీరు దీనికి తోడై చలువన చేకూర్చుచున్నది.

సూక్ష్మదృష్టిని బరిశీలించినవారికి మహాభారతమున పాండవుల జయము ధర్మమునకే జయమనియు, కర్ణుని మరణము దుర్యోధనాదుల దుష్ప్రవర్తన వినాశమనియు తోపకమానదు. రామరెడ్డిగారు కుమారాస్త్ర విద్యాప్రదర్శన ఘట్టమునుండి కురుక్షేత్రయుద్ధము వఱకు నీధర్మసూత్రమును బ్రస్ఫుట మొనర్చిరి. అన్ని విధముల 'కర్ణచరితము' పఠనీయముగనున్నది. ఇట్టి చరిత్రమువ్రాసి రామరెడ్డిగారు ధన్యులైరి. కర్ణుని ఋణము దీర్చుకొనిన రెడ్డిగారికి, కర్ణచరితమునకు, ఆంధ్రలోకము ఋణపడి యుండగలదు. —కె. గోపాలకృష్ణరావు

## సరళ హిందీ వార్తాలాప్

| గ్రంథకర్త : | ప్రకాశకులు : |
| --- | --- |
| శ్రీ పి. వి. రామయ్యగారు | శ్రీ రామకృష్ణ హిందీవిద్యాలయం |
| పుటలు 118, వెల. 1-0-0 | రాజమహేంద్రవరం |

ఇది తెలుగులో వ్రాయబడిన హిందీ గ్రంథము. హిందీప్రచారమునకు ఎక్కువ ప్రాధాన్యముగల ఈ దినములలో ఈ గ్రంథము ప్రారంభకులకు మిక్కిలి ఉపయోగపడగలదు. ఈ గ్రంథకర్తలు అనుభవముగల హిందీప్రచారకులు గనుక సంభాషణ పైఖరులన్నిటిని చక్కగా ఏర్చికూర్చినారు. ఇది ఆదరింపదగిన గ్రంథము.

## తెలుఁగు సామెతలు (ఆర్యోక్తి సప్తశతి)

| రచన : | ప్రతులకు : |
| --- | --- |
| శిరోమణి శ్రీ నూకల సత్యనారాయణశాస్త్రి | రచయిత |
| గద్వాల హౌసు, నాంపల్లి, హైద్రాబాదు. | వెల. రు. 1-4-0 |

తెలుగులో సామెతలున్నవి. అన్నిభాషలలోను నుండును. తెలుగులోనున్న సామెత లధికముగా ఆటవెలది - తేటగీతి - ద్విపదపాదాలకు సరిపోవుచు ఒకటి

రెండక్షరాల ఎక్కువతక్కువలతో నుండును. శ్రీ సత్యనారాయణశాస్త్రిగారట్టి సామెతలను కొన్నింటిని సేకరించి మొత్తము నాల్గు శతకములుగా నీ పద్యగ్రంథమును కూర్చినారు. పద్యముల సంఖ్య 434 అన్నియు గీతములు - ఆటవెలదులు. ఎడనెడ కందములు. కఠినశబ్దముల కర్థము లియ్యబడినవి. చిన్నచిన్న బడిపిల్లలు కంఠస్థము చేయదగిన పద్యములు. అచ్చటచ్చట వేమన సుమతీ శతకములందీయబడిన భావములును నున్నవి. లోకమున ప్రచారముననున్న సూక్తులవంటి సంస్కృత శ్లోకముల కనువాదములు నున్నవి. ఉదాహరణముగా—

కన్యక వరియించు కమనీయ రూపమ్ము
తల్లి ధనము గోరు తండ్రి విద్య
బందుగులును కోరుకొందురు కులమును
వేరుజనము కోరు విందుకుడుపు.

— క్షేమేంద్ర.

## ఆరాధన

డెమ్మీ 1/8 సైజున 34 పుటలుగల కవితాసంపుటి

రచన: ముప్పగౌని నాగేంద్రగౌడు, కళ్యాణదుర్గం

వెల. 50 నయాపైసలు

ఇది ఈ రచయిత తొలిప్రయత్నము. ఉన్న కృతులు ఎనిమిదిన్నీ ఖండకావ్యములు, ఒకటి రెండు ఆంగ్లభావానుకృతులు. ఈ రచయిత గురువు బళ్ళారి శ్రీనివాసమూర్తిగారన్నట్లు ఈ కవితలో ధారాశుద్ధి గోచరిస్తున్నది.

మచ్చుకి ఒక పద్యం:

పోయిన చైత్రమాసమున పోయితి భిక్షకు వీధిలోనికిన్
ఆయెడ నేలాకొంత తడవాయెను అప్పటి కేగువేళకున్
పోయిర పోయిరమ్మనుచు ముంగిలిచేరగ పల్కిరెవ్వరో
హా యిది దైవమాయ యని ఆత్మదలంచుచునేను ఖిన్నుడై.

—శ్రీ వాత్సవ.

# తారాతోరణము

( పద్యసంపుటి )

రచన : శ్రీ నండూరి రామకృష్ణమాచార్య, భీమవరము, ప. గో. జిల్లా

ప్రచురణ : విజ్ఞానప్రభాస, క్రౌను ⅛ సైజు, 78 పుటలు, రెండవకూర్పు, వెల. 1-8-0

ఇది 27 ఖండకావ్యముల సంపుటి. తొలికూర్పు పరిచయములో కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారు "చిరంజీవి కృష్ణమాచార్యులు వ్రాసిన యీ ఖండ కావ్యములసంపుటి యఖండ రసస్ఫుటము...శైలియందును శబ్దజాలమునందును ఛందోమార్గములందును క్రొత్తపాతల మేలు కలయిక గనుపట్టుచున్నది" అని వ్రాశారు. ఈ సంపుటంలో ఆధునిక సమస్యలపై వ్యాఖ్యలవలె కనిపించే పద్య రచనలున్నవి. దీనియందు కవితాశిల్పంకంటే పద్యరచనాకౌశలం ఎక్కువ కని పిస్తున్నది. మహాత్ముని గూర్చి వ్రాసిన "ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః" అనే ఖండ కావ్యంలో ఒక పద్యం :

భూతలమే శ్మశానమయిపోయె చితోద్గతకాలధూమ రే
ఖాతిమిరమ్ములో అలతికాంతుల నీనెడి నెత్తురెత్తి దీ
క్షా తిలకప్రసాధనమునల్పుము తద్రుధిరార్ద్రశోభ ప్రా
భాతమరీచి వీచులయి పర్వును నూత్నయుగోదయమ్ముగన్.

—శ్రీ వాత్సవ

# సమాధాన వేదిక

రచయిత : ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య

ప్రాప్తిస్థానం : తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నం

వెల : రూ. 1—12

బందరు నుంచి వస్తున్న "తెలుగు విద్యార్థి" మాసపత్రికలో పాఠకుల వివిధ ప్రశ్నలకు ఆచార్యాజీ సమాధానా లిస్తూవుంటారు. విద్యార్థుల కోసం ఉద్దేశించబడిన ఈ పత్రికను సంపాదకుడు శ్రీ కె. కోటేశ్వరరావు ఎంతో బాగా నడిపిస్తున్నారు.

సహజంగా ఉద్రేకం అనేది చలరేగే తరుణంలోనూ, వాతావరణంలోనూ విద్యార్థుల పత్రికను ఉత్కృష్టంగా, సాంస్కృతికంగానూ నడపటం అనేది ప్రశంసనీయం. అందుకు తార్కాణం సమాధాన వేదికను ఆచార్యాజీ నిర్వహించటం. కొంచెం వార్తాపత్రికను చదవటం చేతనయిన ప్రతివాడు సర్వజ్ఞుడి ననుకుంటున్న ఈ రోజుల్లో "పెద్దల" సంహాసంప్రదింపులు కూడా తీసుకోవటం విద్యార్థుల పరిణతిని సూచిస్తోంది. మరి ఆచార్యాజీ ముఖ్యంగా విద్యార్థులకు చిరపరిచితులు.

మామూలుగా విద్యార్థులనగానే, ఏవో జెండాలు, సినిమాలు, లల్లాయిపదాలు గుర్తుకువస్తాయ్. వారి బాల్యస్థాయి మాత్రమే స్ఫృహలోకి వస్తుంది. కాని ఈ "సమాధానవేదిక" పుస్తకాన్ని చూస్తే, వారు సంస్కృతిపట్ల బాధ్యత తెలియని వారు కారని తెలుస్తుంది. ఈ పుస్తకంలో సుమారు 180 ప్రశ్నలకు ఆచార్యాజీ సమాధానాలిచ్చారు. ప్రశ్నలన్నీకూడా విద్యార్థుల జిజ్ఞాసను ద్యోతకంచేస్తయ్. మతం, చరిత్ర, రాజకీయాలు, ఆర్థిక విషయాలు, మధ్య మధ్య సాహిత్యంకూడా, సాంఘికవ్యవస్థ, వేదాంతం, శాస్త్రీయవిజ్ఞానం, ప్రజాస్వామ్యం, కమ్యూనిజం, సోషలిజం, పంచశీల, భూదానం, పంచవర్షప్రణాళిక, అంతర్జాతీయరాజకీయాలు, సర్వోదయ, సోవియట్ రష్యా, కాశ్మీరు, విద్య, విద్యాస్థాయి, కళలు, సాహిత్య అకాడమీ — పాఠకులు తెలుసుకోవాలనుకొంటున్న ఈ వివిధవిషయాలకు ఆచార్యాజీ తగురీతిన సమాధానాలిచ్చారు. పత్రికలోని ప్రశ్నలను, సమాధానాలను పుస్తకరూపంలో పాఠకులకు ఇలా అందించటం ముఖ్యంగా విద్యార్థులకు ఎంతో మేలు. వ్యర్థరాజకీయాల నుంచి తప్పించి ఇలా జ్ఞానమార్గాన విద్యార్థులను నడిపించటంలో ఆచార్యాజీ చేస్తున్నకృషి విద్యార్థుల మనోవికాసానికి బాగాతోడ్పడగలదు. పుస్తకంలో అచ్చుతప్పులు అన్నిలేకుండా చూడవలసివుంది. ప్రశ్నలను కూడా వివిధశీర్షికలక్రింద విభజిస్తే ఎంతోబావుండేది. పుస్తకరూపంలో వచ్చేప్పుడు ఆచార్యాజీ బహుశా సమాధానాలను ఇంకొంచెం నిండుగావుండేట్టు మార్పులు చేసేవారేమో ! ఎందుకంటే అప్పటికప్పుడు పత్రికకు వ్రాయటానికి, పుస్తకరూపానికీ కొంచెం తేడావుంటుంది. వచ్చే ముద్రణలో ఇలాంటి మార్పులు చేసుకొనవచ్చు.

విద్యార్థులు, పాఠకులు అందరూ చదవాల్సిన పుస్తకం.

— హ. న. భ





హైదరాబాదు హిందీప్రచారక విద్యాలయ ప్రిన్సిపాలు శ్రీ బాలచంద్ర ఆప్టే ఆంధ్రసభ కార్యదర్శిగను, శ్రీ ఏ. ఎస్. కృష్ణమూర్తి విద్యాలయ ప్రిన్సిపాలుగను, డాక్టరు తేజనారాయణలాల్ గారికి హైదరాబాదునుండి మద్రాసుకు స్థాన పరివర్తన అయిన సందర్భములో విద్యాలయ విద్యార్థులు సన్మానించినప్పటి ఛాయాచిత్రము.

Edited, Printed and Published by V. Anjaneya Sharma, 959 Khairatabad, Hyderabad-4 & Printed at Ajanta Printers, Mahakali St., Secunderabad.